# ఉపన్యాస మంజరి

ఆచార్య కె. సర్వోత్తమరావు
తెలుగు అధ్యయనశాఖ
శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం
తిరుపతి

పారిజాత ప్రచురణలు
6-7-554 హరేకృష్ణ రోడ్
తిరుపతి - 517507

# చిన్న మాట

ఉపన్యాసాలు అనేక రకాలు. ఉదర గొట్టేవి కొన్ని. ఊక దంపుడు రకం కొన్ని. కొటేషన్ల కుప్ప కొన్ని. ఇతరుల్ని మాట్లాడ నివ్వకుండా వాగేవి కొన్ని. సమయాన్ని, సమాజాన్ని దృష్టిలో పెట్టుకుని సాగించేవి కొన్ని. ఏది ఏమయినా "ఉపన్యాసాల" బాణీ వేరు. గాలికిపోయే ఉపన్యాసాలివ్వడం నాకు చేతకాదు. ఉపన్యాస అంశాన్ని గుర్తుంచుకోవడం, విషయసేకరణ చేయడం, వ్రాసుకోవడం, శాఖా చంక్రమణం చేయకుండా సభ్యతగా ముగించడం నాకలవాటు. ఈ దృష్టితో తిరుమల, తిరుపతి, వాల్తేరు, అమలాపురం, హైదరాబాదు, కూచిపూడి మొదలయిన ఊర్లల్లో చేసిన ఉపన్యాసాల్ని ఈ పుస్తకంలో చేర్చాను. కొన్ని యధాతధంగా చెప్పినవే. కొన్ని వ్యాస రూపంలో మలచుకొన్నవే. ఈ ఉపన్యాసాలు, వ్యాసాలు కొన్ని పత్రికలలో వచ్చాయి కూడా. అయినా పుస్తక రూపంగా అందించవలసిందిగా మిత్రులు సలహా ఇచ్చారు. కొందరు పెద్దలు శాసించారు. తిరుమల తిరుపతి దేవస్థానం వారు ఆర్థిక సహాయం చేశారు కూడా. ఈ పుస్తకాన్ని అందంగా తక్కువ వ్యవధిలో ముద్రించి యిచ్చినవారు చి॥ రామకృష్ణ.

ఎందరో మహానుభావులు

అందరికీ వందనాలు

దీపావళి

3-11-94

కె. సర్వోత్తమరావు

## విషయసూచిక


| | | పుట |
|---|---|---|
| 1. | తాళ్ళపాకకవులు-వేటూరివారి మౌలిక కృషి | 1 |
| 2. | అన్నమయ్య జీవితతత్త్వం | 27 |
| 3. | సంకీర్తనలలో సామాన్య మానవుడు | 46 |
| 4. | అన్నమయ్య నవ్వులు | 57 |
| 5. | మహాకవి అన్నమయ్య | 66 |
| 6. | అన్నమయ్య పదకవితా సౌందర్యము | 75 |
| 7. | తమిళప్రబంధలింగలీలైలో శ్రీశైలం | 85 |
| 8. | పురందరదాసు - త్యాగరాజు | 91 |
| 9. | పురందరదాసు పదాలలో సమాజం | 108 |
| 10. | రామాయణంలో వ్యవసాయానికిసంబంధించిన విశేషాలు | 120 |
| 11. | తిరుమలలో చక్రస్నానం | 126 |
| 12. | A Note on Tulka Nanchiyar of Melkote | 132 |
| 13. | అన్నమయ్య - త్యాగయ్య | 142 |
| 14. | అన్నమయ్య సంస్కృత సంకీర్తనలు - ఒక పరిశీలన | 178 |
| 15. | అనుబంధం (ప్రసిద్ధ సంస్కృత సంకీర్తనలు) | 212 |

# ఉపన్యాసమంజరి

## తాళ్ళపాక కవులు-వేటూరివారి మౌలిక కృషి

వెయ్యేళ్ల ఆంధ్రసాహిత్యంలో కవికుటుంబాలు, పండిత కుటుంబాలు, కవి పండితకుటుంబాలు, మత ప్రచారం కోసం నడుము బిగించిన కుటుంబాలు కొన్ని కన్పిస్తాయి. వాటిలో తాళ్ళపాక కుటుంబం చెప్పుకోదగ్గది. ఈ కుటుంబంలో ప్రసిద్ధులు ఎనమండు గురు. అన్నమయ్య, తిమ్మక్క. పెదతిరుమలాచార్యుడు. చిన తిరు మలాచార్యుడు, తాళ్ళపాక చిన్నన్న, తిరువేంగళప్ప, రేవణూరి వేంకటాచార్యుడు మొదలయినవారు తాళ్ళపాక కవులే అనడంలో రెండవ అభిప్రాయం లేదు. కాకపోతే కవికర్ణరసాయనకర్త నర సింగన్న, చెల్లపిళ్లరాయచరిత్ర కర్త తాళ్లపాక అన్నమయ్యల పట్ల మాత్రం నేటికి కొంత చర్చ జరుగుతూనే వుంది.

### 1, రాగిరేకులలో తాళ్లపాక సాహిత్యం :

సుమారు నూటయాభై సంవత్సరాల కాలం పాటు సాగిన తాళ్లపాక సారస్వతం తాళపత్ర గ్రంథాలలో కొన వూపిరి పోసు కొంటున్నా, వ్రాతప్రతుల్లో చెరగి పోతున్నా, అక్కడక్కడ ప్రజల నాలుకల్లో నాట్యమాడుతున్నా చాలా భాగం రాగిరేకుల్లో సూర్యాలోకన (సూరి + ఆలోకనం, సూర్య + ఆలోకనం) నోచుకోక పోవడం మాత్రం సత్యం సాహిత్య పునరుద్ధరణ మాత్రం కాదు, తాళ్లపాక కవుల సాహిత్యం చెక్కిన రాగిరేకులు కూడా చాలాకాలం అజ్ఞాతంగానే వుండిపోయింది వీటిని కనుక్కోవడంలో మూడు దశలు కనిపిస్తాయి

1.1. ప్రథమ దశ (క్రీ. శ. 1915)

మొట్టమొదట అహోబిలంలో రాగిరేకులున్నట్లు గుర్తించడం ఈ దశలో ప్రధానమయిన విషయం. ఈ విషయం గురించి మద్రాసు ఎపిగ్రాఫికల్ రిపోర్ట్‌లో

'Many huge inscribed copper plates are kept in the underground cellers in the temple of Upper Ahobilam· These are one of the same tipe as those found in the Tallapakam vari kottu on the Tirupati Hills and also actually belong to that temple and not to Ahobilam' అనే వివరణ కనిపిస్తుంది.

1. 2. ద్వితీయదశ (క్రీ. శ. 1922)

తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తలయిన మహంత్ ప్రయాగ్‌దాస్ మహంతు వారి సూచనతో ఆలయశాసనాల సేకరణలో భాగంగా రాగి రేకుల్ని గుర్తించడం ఈ దశలో రెండవ ప్రయత్నం. ఈ బృహత్కార్యాన్ని భరించినవారు శ్రీ సాధు సుబ్రహ్మణ్యశాస్త్రి గారు. వారు రేకులలోని సాంకీర్తనాన్ని వ్రాతల కెక్కించినట్లు

'Along with this work of copying epigraphy I transported the Sankirtana copper plates of Talla-pakam musician poets and had them transcribed on paper and preserved these transcripts in three teak wood boxes.

At my request Sri Kalabari Venkatramana kavi, Telugu Pandit of Devasthanam High School· Tirupati contributed foot notes to them'2

అనే వివరణబట్టి తెలుస్తున్నది. అయితే ప్రెస్ మేనేజరు అశ్రద్ధవల్ల ఆ ప్రతులు నశించాయి.

13 తృతీయదశ (క్రీ. శ. 1947)

శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారి ప్రయత్నంతో వెలువడ్డ రేకులు ఈ దశలోకి వస్తాయి. ఈ ప్రయత్నం గురించి ఆచార్య ఆనందమూర్తిగారు

'Preservation and propagatian of Musica' Literature on Copper Plates' అనే వ్యాసంలో

Indeed the discovery of these copper plates from inside the temple celler at Tirumala by the temple authorities at the begining of this centuary and the rediscovery of their real worth extent and content in the year 1947 as highlighted by the indefatigable, endeavours of my revered father, the Late Scholar Professor Prabhakara Sastri,3 అని వివరించారు. ఈ ప్రయత్నంలో శాస్త్రిగారి ప్రియశిష్యులు శ్రీ శ్రీనివాసాచార్యులు తీసుకొన్న చొరవ సాహసోపేతం. ప్రశంసనీయం. అహోబలం' శ్రీరంగం నుండి రాగిరేకుల్ని తిరుపతికి చేర్చడం కూడా 1947 తర్వాతనే జరిగాయి.

తాళ్లపాక సాహిత్య ముద్రణ-సంస్థలకృషి :

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి జీవితకాలం దాకా (1888-1950) గణన లోనికి తీసుకున్నప్పుడు తాళ్లపాక సాహిత్యాన్ని సాహిత్యలోకానికి అందించిన సంస్థల్ని పేర్కొనడం సమంజసం. ఆ సంస్థలు

(అ) ఆంధ్ర సాహిత్య పరిషత్తు, కాకినాడ.

(ఆ) ఆంధ్రపత్రిక-భారతి యాజమాన్యం.

(ఇ) తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి.

(ఈ) వావిళ్ల సంస్థ, మదరాసు.

2.1. ఆంధ్ర సాహిత్య పరిషత్తు-కాకినాడ :

ఈ సంస్థవారు తాళ్లపాకవారి రేకుల్ని తరలించుకొని పోయి వాటిలో "రేఫఱ కారపద్యాలు, చక్రవాళమంజరి" మొదలయిన వాటిని 1915 పరిషత్ పత్రికలో ప్రకటించారు, ఇవే కాకుండా తిరుపతి లోని రాగిరేకుల నుండి ఆంధ్రసాహిత్య పరిషత్తువారు "వేంకటేశ్వర శతకము"నే శతకాన్ని వ్రాయించి తెప్పించుకొని గ్రంథాలయంలో భద్రపరచినట్టు తెలుస్తున్నది.[5]

2.2. ఆంధ్రపత్రిక-భారతి యాజమాన్యం :

శ్రీ శాస్త్రిగారు మదరాసులో అవిరామంగా తాళ్లపత్ర, వ్రాతప్రతుల్ని పరిశోధిస్తున్న కాలంలో బయటపడిన "శ్రీ వేంక టేశ్వర వచనాల్ని" భారతి పత్రికలో ప్రచురించారు.

క్రోధన వైశాఖ సంచికలో (1925మే) (శ్రీ వేంకటగిరి దేవా, నందకాయుధధరా! అలమేలుమంగాపతీ! క్షీరాబ్ధిశయన, దామోదరా, అనే సంబోధనలతోవున్న 5 వచనాల్ని క్రోధన మార్గశిర సంచి కలో (1925,డిసంబర్) (హృషీకేశా, కమలనాభా, గోవింద, పర మాత్మా, మురహరా, గరుడధ్వజా, గోపికావల్లభా అనే సంబోధనలతో కూడిన) 7వచనాల్ని ఆంధ్రలకానికి పరిచయం చేశారు. అప్పటికి ఈ వచనాలెవరివో ఖచ్చితంగా తెలియదు. అందువల్లనే శాస్త్రిగారు

"ఇవి తాళ్లపాకవారు రచించినవై యుండవలెను....ప్రాచీనులలో నింత రసవంతము భక్తిభరితమునగు వచనరచన యసాధారణముగా నున్నది....వీనినెల్లం గ్రమముగా వెల్లడింపం గోరికవడుచున్నాడను. సహృదయులివి చవిగొందురుగాక" అని వ్రాశారు.

2.3. తిరుమల తిరుపతి దేవస్థానం :

తిరుమల తిరుపతి దేవస్థానం వుద్యోగులుగా వుంటూ తాళ్లపాక సాహిత్యాన్ని సారస్వత పిపాసువుకు అందించడానికి ప్రయత్నించినవారు ముగ్గురు.

1. శ్రీ విజయ రాఘవాచార్యులు
   శ్రీ జి. ఆదినారాయణ నాయుడు.
2. శ్రీ మానవల్లి రామకృష్ణకవి.
3. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి.

3.1. శ్రీ విజయ రాఘవాచార్యులు-
జి. ఆదినారాయణ నాయుడు :

శ్రీ విజయరాఘవాచార్యులుగారు దేవస్థానం ఎపిగ్రాఫిస్ట్ గారు కాగా జి. ఆదినారాయణ నాయుడు ఆర్కియాలాజికల్ అసిస్టెంట్. తి.తి.దే. కమిటీ కమీషనరు రావుబహద్దూర్ కె. సీతారామిరెడ్డిగారి హయాంలో ఈ పండితద్వయం 'Vol. 1-The minor works of Tallapakam Poets' 1935 లో ప్రకటించారు.

ఈ "లఘుకృతులు" విషయసూచికలో అప్పటికే

Andhra Vedanta Bhagavatgita in the press. Chinnana Adhyatma Sankirtanalu in the press. Sringara Satakamulu in the press Chinnana Ushaparinayam in the press అనే మాటలు కనిపిస్తాయి. ఈ సూచికలోనే

Chinnana Paramayogivilasamu-published, Chinnana Ashtamahishii Kalyanamu published అనే సూచన లున్నాయి.

ఈ పండితద్వయమే క్రీ. శ. 1936లో 'Vol. II-Ad-dyatma Samkirtanalu' by Annamacharya సంపుటాన్ని శ్రీ కె. సీతారామరెడ్డి గారి హయాంలో వెలువరించారు. ఈ సంపుటంలో 413 సంకీర్తనలున్నాయి.

శ్రీ విజయరాఘవాచార్యులవారు క్రీ.శ. 1937లో 'Vol. III -Srinagara Sankirtanalu' ప్రచురించారు. ఈ ముద్రణకు ప్రేరణ కలిగించినవారు శ్రీ ఎ. రంగనాద మొదలియార్. ఈ సంపుటంలో 672 సంకీర్తనలున్నాయి.

ఈ మూడు సంపుటాలలోను రాగిరేకుల ప్రస్తావనగాని పరిష్కరణ పద్ధతులుగాని, భవిష్యత్కార్య క్రమంగాని సూచితం కాలేదు, రెండు, మూడు సంపుటాలలో రెండు శీర్షికలున్నాయి. మొదటిది గీతనామ-రాగము-పుటసంఖ్య, రెండవది గీతానుక్రమణిక. ఇందులో కీర్తనల ఆకారాది నియమం కనిపిస్తుంది, ఫలానివి సంస్కృత కీర్తనలనే సూచన కుండలీకరణంలో చూపబడింది.

3. 2. శ్రీ మానవల్లి రామకృష్ణకవి :

తాళ్లపాకవారి సాహిత్యాన్ని ముద్రణ రూపంలో తీసుకొని రావడానికి ప్రయత్నించిన వారిలో సుప్రసిద్ధ విమర్శకులు శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు ఒకరు. తి.తి.దే. ప్రాచ్యపరిశోధనాలయం ప్రధాన సంపాదకులయిన శ్రీ వరవస్తు వేంకట రామానుజస్వామిగారు.

'The publication of this Vol. IV was undertaken in 1947 and the editorial work was entrusted to Sri M. Ramakrishna Kavi, M.A., the Reader in Telugu in the institute. But as he had shortly afterwords to devote all his attention to the compilation of the Bharatakosa row being published by the institute the editorial work had to be entrusted to the newly appointed Research Asst in Telugu Sri S. Ramakrishna Sastri, M.A After working at it for some months Mr. S. Ramakrishna Sastri expressed his disinclination to continue the work' అని తెలియ జేయడం గుర్తింపదగ్గ అంశాలు.

శ్రీమానవల్లిగారు తాళ్లపాక సాహిత్యముద్రణ చేపట్టకున్నా "అన్నమాచార్య చరిత్రాన్ని" దేవస్థానం ప్రాచ్యపరిశోధక సంస్థకు చేరవేసినట్లు ఆ వ్రాతప్రతి చివరి 'Through M Ramakrishna kavi garu Borrowed from Sri T. Suryanarayanayya garu' సూచనలు సాక్ష్యమిస్తున్నాయి.7 శ్రీకవిగారు "తాళ్లపాక కవుల సంకీర్తనలు" అనే పెద్దవ్యాసాన్ని వ్రాశారు. ఈ వ్యాసం Golden Jubilee of Tirumala Tirupati Devasthanam సంచికలో8 పునర్ముద్రితమయింది కూడా.

3.3. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు :

శ్రీ శాస్త్రిగారు తాళ్ళపాక సాహిత్య పరిచయం 1918 లోనే ఉన్నట్లు స్పష్టం. ప్రబంధరత్నావళి పీఠికలో అన్నమయ్యగారు-తాళ్ళపాక-

"ఈతడు రావుబహద్దూర్ కందుకూరి వీరేశలింగంపంతులుగారి కవులచరిత్ర ప్రథమ భాగమున జేరవలసినవాడు. పదునాల్గవ శతాబ్దిలో నించు మించు శ్రీనాథుని కాలమున నున్నవాడు. తిరుపతి తామ్రశాసనము నుండి ఈ విషయమెరుగబడును.9 అని పరిచయం చేస్తూ వేంకటేశ్వర శతకంలోని 'అరిసెలు నూనెగారల'ను పద్యాన్ని 10 మన ఎరుకలోనికి తెచ్చారు.11

బసవపురాణము పీఠికలో 'ఛందస్స్వాతంత్ర్యము శీర్షికలో -

"సోమనాథు డితరాంధ్రకవులు పాటించిన ద్విపదచ్ఛందో నిబంధనమున గొంత స్వాతంత్ర్యము వహించి మారుపాటు గావించెను. తాళ్ళపాక చిన్నన్న ప్రాచీన సాంప్రదాయనురోధమున ద్విపదలక్షణము నిట్లు నిర్వచించినాడు" అని చిన్నన్న 18 పాదాలను ఉదహరించారు.

3.3.1. తిరుపతి ప్రాచ్యపరిశోధనాలయంలో శాస్త్రిగారు :

ఈ సందర్భంలో 'మదరాసు విడిచి శ్రీ తిరుపతి వేంకటేశ్వరుల సన్నిధిసేవ కావింపవచ్చుటలో నా తొల్తటికోరిక తాళ్ళపాకసూరి రచనల నన్నింటిని వెల్లడించుట'13 అనే శాస్త్రిగారి దీక్షా బలాన్ని మనం గుర్తించవచ్చు. ఈ దీక్షా సిద్ధికోసం శాస్త్రి గారు నాలుగు పథకాలు వేసుకొన్నట్లు స్పష్టమవుతుంది.

1. తాళ్లపాక కవుల రచన - ముద్రణ.
2. తాళ్లపాక కవుల సాహిత్య పరిశోధనకు పూర్వరంగస్థాపన
3. వేంకటేశ్వర వాఙ్మయ క్రోడీకరణ.
4. సమాజంలో తాళ్ళపాక సంకీర్తనల ప్రచార ప్రయత్నం.

3.3.1.1. తాళ్లపాక కవుల రచనల ముద్రణ :

శ్రీ శాస్త్రిగారు తిరుపతి చేరుకొన్న తరువాత అందించిన గ్రంథాలు 6. శ్రీవేంకటేశ్వర వచనములు, అన్నమాచార్య చరిత్ర, తాళ్లపాక అన్నమయ్య శృంగార సంకీర్తనములు 4వ సంపుటము, తాళ్లపాక అన్నమయ్య ఆధ్యాత్మ సంకీర్తనములు 5వ సంపుటము, సుభద్రా కల్యాణం, శ్రీ వేంకటేశ్వర శతకంలోని కొన్ని పద్యాలు.

3-3-1-1-1 శ్రీవేంకటేశ్వర వచనములు :

శ్రీశాస్త్రిగారు 1935 క్రోధన వైశాఖ మార్గశిర భారతి సంచికలలో ఈ వచనాల కొన్నింటిని ప్రచురించడం ఈ వ్యాసం తొలిభాగములో ప్రస్తావింపబడింది. ఈ ప్రయత్నం కొనసాగించాలనే సహృదయుల ప్రార్థనతో శాస్త్రిగారు "ఆంధ్రపత్రిక ముద్రణాలయం"లో మొదలుపెట్టారు. 120 వచనాలు 80 పుటలు ముద్రిత మయ్యాయి. కాని తిరుపతి దేవస్థానమువారు వచనాలను ముద్రిస్తున్నారని తెలిసి తాత్కాలికంగా తన ప్రయత్నం ఆపారు. దేవస్థానంవారి ముద్రణలో 47 వచనాలు మాత్రం వుండడం, అసమగ్రం కావడం, ఆవచణాల వునికి తెలియకపోవడంతో పునః ప్రారంభంచేశారు. తనదగ్గరున్న అచ్చుమచ్చు పాఠాలతో ప్రయత్నం కొనసాగించారు. దేవస్థానం వారి వైరాగ్య వచన మాలికాగీతాల గురించి శ్రీ వేటూరి వారి అభిప్రాయం.

"తిరుపతి దేవస్థాన ముద్రణము తప్పులతో నసమగ్రముగానే యుండెను."14

ఈ వచనముల ప్రకటనలో శాస్త్రిగారి పద్ధతులు :

1. మదరాసు, తంజావూరు భాండాగారంలోని వచనాలను రేకుల వచనాలతో పరిశీలించడం. పూర్వముద్రణలో 47 వచనాలుండగా తంజావూరు ప్రతిలో 175 వచనాలుకాగా శాస్త్రిగారు పరిష్కరించి 166 వచనాలను నిర్దుష్టంగా ఇవ్వడం.

2. పీఠికాభాగంలో వచన రచన-తాళగంధి చూర్ణికములు, వేంకటేశ్వర వచనములు - వానియోగ్యత, తాళ్ళపాకవారు-గ్రంథ ముద్రణము మొదలయిన శీర్షికలతో పరిచయం చేయడం. చివర 'శ్రీ వేంకటేశ్వర ప్రభాత స్తవాన్ని, ఆపై 47 వచనాలకు వచనసంఖ్య రాగతాళములు అనే సూచిక ఇవ్వడం.

అయితే పూర్వముద్రణంలోని "శ్రీతిరువేంగళనాథ దేవునికి తాళ్లపాక యన్నమాచార్యుల కుమారుడు పెద తిరుమలాచార్యులు విన్నవము చేసిన వైరాగ్య వచనమాలికా గీతాలు అనే వాక్యం శాస్త్రిగారి ముద్రణలో జారిపోవడానికి కారణం తెలియదు

పీఠికవల్ల తెలిసిన విశేషాలు :

1. ఈ పీఠికాభాగంబట్టి కృష్ణమాచార్య సింహగిరి వచనాలను పెదతిరుమలయ్య శ్రీవేంకటేశ్వర వచనాలను తులనాత్మకంగా పరిశీలించే అవకాశమేర్పడడం.

2. వీరశైవ సాహిత్యాన్ని, తాళ్ళపాక సాహిత్యాన్ని తులనాత్మకంగా పరిశీలించడానికి అనువైన భూమిక ఏర్పడడం.

3. క్రీ.శ. 1480 ప్రాంతంలో నూట ఎనిమిది తిరుపతులజాబితా క్రమం తెలియడానికి వీలుకావడం. (శ్రీవేంకటేశ్వర వచనంలోని 147వ వచనం.)

ఇన్ని విశిష్ట లక్షణాలుండడం వల్లనే డా॥ పోచిరాజు శేషగిరిరావు "ఈ సాహితీ ప్రక్రియకు వేటూరివారి పీఠిక సర్వ సమగ్రము" అన్నారు.

3.1.1.2 అన్నమాచార్య చరిత్ర :

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ప్రాచ్య పరిశోధనాలయంలో 3515 నెం. "అన్నమాచార్య చరిత్రము" అనే వ్రాతప్రతి వుంది. ఇందులోని కాగితాలు 49. పుటలు 69 ఇవేగాక మరొకప్రతి లభించినట్లును ఈ రెండు ప్రతులు ఆధారంగా అన్నమాచార్య చరిత్ర ద్విపద పరిష్కరింపబడి ప్రచురించినట్లు ఆచార్య వేటూరి ఆనందమూర్తి భావించారు.16 అయితే ఈ గ్రంథానికి తృతీయ ముద్రణ పరిష్కర్తలయిన శ్రీ గౌరి పెద్దివారు-

"ఈ అన్నమాచార్యచరిత్ర (ద్విపద) మూల ప్రతి ఒక్కటే కలదు, అది తప్పులకుప్ప. దానిని కీ॥శే॥ శాస్త్రిగారు ఎంతో పరిశ్రమించి, ఈరూపమునకు తెచ్చి 1949లో మొదటిసారిగా ముద్రింపించినారు. మూలగ్రంథమును, ముద్రితగ్రంథమును ప్రక్కన ప్రక్కన నుంచుకొని చూచినవారికిగాని శాస్త్రిగారి పరిశ్రమ తెలియదు ఒకే మూల ప్రతితో పరిష్కరణము సాగించుట ఎంత కష్టమో ఆపనిచేయు వారికే ఎరుక"17 అని స్పష్టంచేశారు. శాస్త్రిగారు చూసిన ప్రతిఆచూకి తెలియవలసి వుంది.

పరిష్కరణ పద్ధతులు :

తప్పులు తడకగా వున్న మూలప్రతిని పఠన యోగ్యంగా పరిష్కరించడంలో శాస్త్రిగారు నాలుగు పద్ధతుల్ని అవలంబించినట్లు తెలుస్తున్నది.

1. నేటి వ్రాతకు అనుగుణంగా లిపి సంస్కరణ.
2. అక్షర దోషాలు, లేఖకదోషాలను సరిదిద్దడం.
3. యతిప్రాస దోషాల సవరణ.
4. అవసరమైనచోట్ల మార్పులు వేయడం, వలసినచోట్ల "పూరణ వేయడం.

పై నాలుగింటిలో చివరి రెండింటిని మాత్రం పరిశీలించడం సబబు.

యతిభంగం :

చుట్టిన చెంగల్వ తొళ్లంపు దండ-వ్రా. ప్రతి.
చుట్టిన చెంగల్వ చొళ్లెంపు దండ-ము.ప్ర.ప్ర.22

ప్రాసదోషాలు :

ఎ. అరటి పండులు మేసి యలసి పైదప్పి

కొనివచ్చి కోవెలల్ క్రోలునచట. వ్రా.ప్ర.ర-న లకు ప్రాస కుదురదు. అందువల్ల అనటి (పుట. 3) అని సవరణ.

బి. ఫాలరేఖల నిండు పట్టెనామములు

పివిరి కుచ్చుల సెక్కపెట్టిన బొండ్లు. వ్రా.ప్ర.ల-వి లకు ప్రాస కుదురదు. పీలి (పుట 13) అని సవరణ.

సి. గాటంపు బొజిగెల గడు రమ్యముగను

పరిషజ్జనంబుల పజ్జనేగుచును వ్రా.ప్ర, గాట-పరి లకు ప్రాస కుదురదు. గరిమల (పుట 14) అని సవరణ.

డి. ప్రేమతో బుజియింప బెట్టి యారార్చి

తిరుమలప్పని దేవదేవుని కొలువ. వ్రా.ప్ర. ప్రేమ- తిరుమల ప్రాస కుదురదు. కనుక పెరిమ (పుట 17) అని సవరణ.

ఇ ధరమీద నిట్లను దాళ్ళ పాకొన్న
మయ నామకుండైన మద్భక్తుడొకడు. ప్రా.ప్ర.
ధర-మయలకు ప్రాస కుదురదు. దయమీర (పుట 27)
అని సవరణ.

ఎఫ్. బదియుడై వరివంధి బలముల నడచి
నలిరేగి సింహాసనంబు చేకొనుచు. ప్రా.ప్ర. బది-నలి ప్రాస
కుదురదు. బలియుడై (పుట. 32) అని సవరణ.

పదాలమార్పు :

ఎ. అన్నియు నచ్చోట ననిశంబు నుండు
నందు నింద్రుండు నయ్యఖిల భూసురులు. ప్రా.ప్ర.
అందు వసించు నయ్యఖిల భూసురులు. ము.ప్ర. పుట. 4
పైపాదాలలో 'ఇంద్ర' ప్రసక్తి అనవసర ప్రసంగము.

బి. నూరుమాటులు చెప్పి నులివెట్టి ప్రా. ప్ర.
నూరుమాటలు చెప్పి నులివెట్టి

సి. క్రమవిధి జటయు వర్ణక్రమసరణి ప్రా.ప్ర.
క్రమశిఖి జటయు వర్ణక్రమసరణి ము.ప్ర. పుట 8

డి. తనయుండు కల్గిన తనపెట్టుటెల్ల ప్రా.ప్ర.
తనయుండు కల్గిన తనపుట్టుటెల్ల ము.ప్ర. పుట 8

మగవానికిపుట్టువు సార్థకం పితౄణం తీర్చినప్పుడే. అందువల్ల
శాస్త్రిగారిపాఠం బాగుందని నా భావన.

ఇ. గరుడ శనేతుల గపిరాజముల ప్రా.ప్ర.

గరుడ సేనేశుల గపిరాముజల ము. ప్ర.పు. ఓపి శనేశుని ప్రసక్తి అనవసరం. వైష్ణవాలయాలలో "విష్వక్సేన" సాన్నిధ్యం తప్పక వుంటుంది.

పాదపూరణ :

యోగ మార్గంబున నొక కొన్ని బుధులు
రాగిల్లి శృంగారరసరీతి కొన్ని ప్రా.ప్ర.

ఈ రెండు పాదాల మధ్య శాస్త్రిగారు

వైరాగ్యరచనతో వాసింపగల్గు అని చేర్చినట్లు స్పష్టమవుతుంది.

అన్నమాచార్య చరిత్రము-పీఠిక విశేషాలు :

శ్రీ శాస్త్రిగారు "అన్నమాచార్య చరిత్రము" ద్విపదను వెలువరిస్తు 133 పుటల పీఠిక వ్రాశారు. ఈ పీఠికలో పరిశోధకులకు నాలుగు రకాలయిన అధ్యయన పద్ధతుల్ని సూచించారు.

1. భౌగోళిక అధ్యయన సూచన.

2. చారిత్రక అధ్యయన సూచన.

3. తులనాత్మక సాహిత్య అధ్యయన సూచన

4. భాషాధ్యయన, కోశనిర్మాణసూచన.

1. భౌగోళికాధ్యయన సూచన :

శాస్త్రిగారు పీఠికలో "అన్నమాచార్యులు తిరిగిన దేశములు కీర్తించిన వేల్పులు" గురించి సంగ్రహ వివరణచేశారు. ఈస్ఫూర్తితో అన్నమయ్య సంకీర్తనల్లో తెలుగునాడు18 అనే సిద్ధాంత గ్రంథం వెలువడడానికి వీలయింది.

౭. చారిత్రకాధ్యయన సూచన :

సాళ్వ నరసింహ రాయలు, కపిలేశ్వర గజపతి, రాయల కైంకర్యములు, సంకీర్తన భండారము మొదలయిన శీర్షికలు చారిత్రక పరిశోదకులకు ముడిసరుకులాంటివి. ఆయా కాలాలలో స్వామికి జరుగుతున్న సేవాకైంకర్యాలను పరిశోధించడానికి ఈశీర్షిక వీలు కల్పించింది ఈ ప్రేరణవల్ల "అన్నమయ్య సంకీర్తనల్లో ఉత్సవ విశేషాలు" అనే సిద్ధాంతగ్రంథం'19 ముద్రణకు నోచుకొంది.

౮. తులనాత్మక సాహిత్యాధ్యయనం :

ఆంధ్ర సంకీర్తనములు, ద్రావిడ పాశురములు. ఆళ్వార్లు అన్నమాచార్యుడు మొదలయినవి తులనాత్మక అధ్యయనానికి దోహదం చేసే అంశాలు.20

అలాగే అన్నమాచార్య - పురందరదాసు, సంకీర్తన ముద్ర సామ్యములనే శీర్షికల అన్నమయ్య - త్యాగయ్య 21, అన్నమయ్య క్షేత్రయ్యలను తడవడంవల్ల కొన్నిపుస్తకాలు వ్రాయడం, అవి వెలుగులోనికి రావడం జరిగింది.

అలాగే అన్నమయ్య రచనలలోని మధుర కవితావిశేషాలు అన్నమయ్య సంకీర్తనలలో జానపద గేయ ధోరణుల"ను సిద్ధాంత గ్రంధానికి 22 ఊపు ఇచ్చింది. ఈలాగే అన్నమయ్య - వేమన, అన్నమయ్య-శ్రీపాదరాయలు వంటి అధ్యయనంకూడ చేయడానికి వీలయింది. ఇవేకాక ఈ మధ్య మరికొన్ని సిద్ధాంత వ్యాసాలుకూడా వచ్చాయి.

4. భాషాధ్యయన, కోశనిర్మాణ సూచన :

కొంతవరకు తాళ్లపాక సాహిత్యంపట్ల పరిశోధకులు మొగ్గుచూపారు గాని తాళ్లపాకవారి భాషపట్ల అధ్యయనం మందంగా సాగుతోంది. తాళ్లపాకవారి భాషపట్ల శాస్త్రిగారి ఆలోచనలు కనుచూపుమేరలో ఆచరణకువచ్చే అవకాశాలు కనిపించడంలేదు. వాటిలో కొన్ని—

1. నిఘంటువుల కెక్కని దేశితెలుగుపలుకులీ సంకీర్తనములో నెన్నో కలవు. అట్టివానినెల్ల సేకరించి వేరుగా నిఘంటువులకు పరిశిష్టములుగా వెలయింపదగును.

ఈ పరిశ్రమకు ఇంకా శ్రీకారం చుట్టకపోవడం మన అనాసక్తి.

2. "అన్నమాచార్య సంకీర్తనముల భాష పశ్చిమాంధ్రదేశమున వాడుక గన్నది. అతని పలుకుబళ్లు చాలా కృష్ణదేవరాయలయు తదితరకవులయు రచనలలోని కెక్కినవి"—ఈలాంటి పరిశోధనకు మనం అంకురార్పణ చేయవలసి వుంది.

డా॥ వేటూరి ఆనందమూర్తి గారు, శ్రీ గౌరి పెద్దిరామసుబ్బశర్మ గారు, శ్రీమతి రామలక్ష్మి గారు ఈ రంగంలో చేసిన కృషి మరచిపోలేని అంశాలు.

ద్విపద చరిత్రను, సుమారు రెండువేలఏనభై రేకులలోని కీర్తనలను తులనాత్మకంగా పరిశీలిస్తూ పీఠిక వ్రాయడం సామాన్యమైన విషయంకాదు. ఇందులో 67 రేకులలోని కీర్తనలు, శేషాచార్యుల వ్రాత లవతిలోని 8 పాటలు, ప్రజలనాలుకలలో నడయాడే 4 ప్రతిలో కీర్తనలు

కనిపిస్తాయి. పీఠికకు, చరిత్రకు సమగ్రమయిన విషయసూచిక ఇవ్వడం మరొక ప్రత్యేకత.

3.3.1.1.3. అన్నమాచార్య సంకీర్తనలు :

శ్రీ శాస్త్రిగారు 1947లో అన్నమాచార్య శృంగార సంకీర్తనల్ని, 1950లో అధ్యాత్మ సంకీర్తనల్ని ప్రకటించారు. ఈ సంకీర్తనల ప్రకటనలో శాస్త్రిగారికి నిర్దిష్ట ప్రణాళిక వుంది.

1. ప్రధాన సంపాదకుల ఆదేశం పాటించడం.

The māin work of the editor has been to change the peculiar orthography of the plates to suit to modern times, keeping the text faithful to original in other respects.[23]

2. తాళ్ళపాకవారి సంకీర్తనల రాగిరేకులను స్వాధీనం చేసుకోవడం.

తాళ్ళపాక అరలోని రేకులెన్నో, వాటిలో కరగించివేసినవెన్నో ఇతర ప్రాంతాలకు తరలిపోయినవెన్నో. ఇప్పటికీ "చిక్కుముడి" లాంటిది. శ్రీ సాధు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు —

'The copper plates about 3000 in number preserved in a small cell in S.V. Temple on which they were engrave on both sides witn 3 Sankeertanas on each side.' [24] అని చెప్పారు. శ్రీ శాస్త్రిగారందువల్లనే రాగిరేకులను స్వాధీనపరచుకొంటి నంటూ రేకులసంఖ్య 2635 అని తెల్పారు. అహోబలం నుండి తెప్పించుకొన్నవి 35, శ్రీరంగం నుండి చేరినవి 40.

అయితే తాళ్లపాక వాఙ్మయాన్ని పరిష్కరించిన శ్రీ గౌరిపెద్ది రామ సుబ్బశర్మ గారి లెఖ్ఖ ప్రకారం రేకుల సంఖ్య 2701. (శృంగార సంకీర్తనములు - పీఠిక 22వ సం.పు.)

రాగం విలువ తెలియని జాతి రాగిరేకుల్ని పాత్రలుగా చేయ డంతో నష్టమైనదిపోగా మిగిలిన వాటిని భద్రపరచే సంకల్పం శ్రీ వేటూరి వారిలో కనిపిస్తుంది. అంచేతనే గౌరిపెద్దివారు

"శాస్త్రిగారు ఆమాత్రము శ్రమ తీసికొనకుండినచో రేకుల విష యమున ఆపాటి నిర్ధారణ కూడ నేటికిని కుదిరి యుండదు. వారి జాగ్రత్త చాలా మెచ్చుకొనతగినది" 25 అని నివాళులర్పించారు.

3. కవులవారిగా రేకుల వింగడింపు.

తి. తి. దే. వారు ముద్రించిన తొలిమూడు సంపుటాలు అస్త వ్యస్తంగా, అపక్రమంగా, కవుల రచనలలో అవతవక పద్ధతిలో ప్రకటింపబడడాన్ని శాస్త్రిగారు గుర్తించి ముందు కవులను బట్టి, విషయం బట్టి వింగడింపు చేశారు. ఆ వింగడింపులో మూడు పద్ధ తులు పాటించారు.

1) "అ" గుర్తు గలవి ఆధ్యాత్మసంకీర్తనలు, శ్రీ గుర్తు గలవి శృం గారసంకీర్తనలు.

2) స్పష్టంగా ఉల్లేఖితమయిన దానిని అలాగే గౌరవించడం.

3) సంకీర్తనలలో స్పష్టంగా ఫలానా వారివని తెలియనప్పుడు రేకుల స్వరూపం బట్టి అడ్డము, నిడుపు, సమపరిణామం బట్టి వర్గీకరించడం.

| | |
|---|---|
| అన్నమాచార్యుల శృంగార సంకీర్తనలు - | 15 1/2 - 7 |
| పెదతిరుమలాచార్యుల శృంగార సంకీర్తనలు - | 16 - 7 |
| చినతిరుమలాచార్యుల శృంగార సంకీర్తనలు - | 15 1/2 - 7.2 |
| అన్నమాచార్యుల అధ్యాత్మ సంకీర్తనలు | 15 1/2 7 |
| పెదతిరుమలాచార్యుల అధ్యాత్మ సంకీర్తనలు | 15 3/4 - 6 3/4 |
| చినతిరుమలాచార్యుల అధ్యాత్మ సంకీర్తనలు | 15 - 7 1/2 |

ఇవి కాకుండా 33 అం. పొడవు 2 1/2 అ. వెడల్పు రేకులు 120, తునకలు 5 ఉన్నాయని నిర్ధారించడం.

అన్నమాచార్య శృంగార సంకీర్తనలు :

తి. తి. దే. వారు ముద్రించిన 3వ సంపుటంలో తొలి వంద రేకులలోని 1 నుండి 18, 20 నుండి 30, 61 నుండి 95 దాకా వున్న రేకుల పాటలు ముద్రితం. అంచేత శాస్త్రిగారు 31వ రేకులోని 3వ పాట నుండి 60వ రేక దాకా వున్న పూర్తి పాటలను ప్రకటించారు. తతిమా వాటిని పాతసంపుటంలో పరిష్కృతమైనట్లు నిర్ణయించారు. అలాగే తి. తి. దే. వారు ముద్రించిన సంపుటాలలో అన్నమాచార్యులవి, పెదతిరుమలాచార్యునివి వేరు వేరుగా రేకు నెంబరు, రేకులలోని మొదళ్లు అచ్చుపుట సంఖ్యలతో స్పష్టంగా చూపారు. ఇదే పద్ధతిని అధ్యాత్మ సంకీర్తనల పీరికలో కూడా శాస్త్రిగారు విశదం చేశారు. రేకులలో 1 నుండి 10 దాకా, 21 నుండి 30 దాకా, 37 నుండి 50 దాకా, 81 నుండి 100 దాకా మొత్తం 54 రేకుల పాటలను శాస్త్రిగారు పరిష్కరించి వేశారు. తాము నిర్ణయించిన రేకుల క్రమానికి చెందిన పాటలు రెండవ సంపుటంలో ఉన్నట్టయితే వాటిని పరిష్కృతంగానే భావించి వదలి పెట్టారు.

**అన్నమయ్య సంకీర్తనలు - పరిష్కరణ పద్ధతులు :**

శాస్త్రిగారు సంకీర్తనల పరిష్కరణలో నాల్గుపద్ధతులు పాటిం చాడు.

1) లిపి పరిష్కరణ,
2) అరుదుగా పాదదీపిక లివ్వడం.
3) స్పష్టత కోసం మార్పులు.
4) సంపుటం చివరలో సూచికలు.

**లిపి పరిష్కరణ :**

లిపికి సంబంధించి శాస్త్రిగారి వివరణ "పూర్వమెప్పుడో వ్రాయించి యుంచిన కాగితములు, వాని లిపి రీతులు నేటి ముద్రణమున కుప యోగపడదగినట్లు లేవు గాన ఇంక ముద్రింప వలసిన గ్రంథ భాగ ములను రాగిరేకులను దగ్గర నుంచుకొని చూచుచు నాటి లిపి రీతిని నేటి వర్తమాన లిపి రీతికి ననుగుణముగా మరల వ్రాసి ప్రకటింప వలసియున్నది."

**రేకుల వ్రాతలలోని వింతలు :**

1) రేకుల వ్రాతలో హ్రస్వదీర్ఘములకు విడి విడిగా గుర్తులు లేక పోవడం.
2) అ (హల్లులపైకూడా) నూ, మీ, మూ, మో, యీ, యో, లూ, వూ తప్ప దీర్ఘాక్షరములు కనిపించక పోవడం.
3) తతిమ హల్లులపై ఇ, ఈ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ లను వింగడించుకోవాలి గాని ప్రత్యేక చిహ్నాలు లేకపోవడం.

4) మో, యోలు రేకులన్నిటిలోను దీర్ఘంగా వుండడం.
5) ద్విరుక్తాక్షరానికి ముందు నిండుసున్న, ద్విరుక్తం కాని వరుష, సరళాలకు ముందు నిండుసున్న వుండడం.

పైవాటి నన్నిటిని శాస్త్రిగారు జాగ్రత్తగా గుర్తించి వరన యోగ్యమయిన పద్ధతిని కూర్చారు. అయితే పాట మొదటనున్న యకార, వకారాది తెలుగు పదాలను మాత్రము అజాదిగా, తెలుగు పదాలలోని శకారాన్ని సకారంగా మార్చారు.

స్పష్టతకోసం మార్పులు :

గతి యలమేల్ మంగ నాచారికి - 2వ రేకు
"నాంచారికి" (5-7) అని మార్పు.
కమలజ పట్టుము కాళాజి - 2వ రేకు
కాళాంజి (5-12) అని మార్పు.
ఒనరి బిన్నాణి జీవులనెడి బియ్యము - 21వ
రేకు విన్నాణి (5-72) అని మార్పు.
విడువరాని ధర్మవిధుల పురుషులను -
82వ రేకు
విడువరాని ధర్మ విధుల (5-218)
అని మార్పు.
నిరత కర కిలిత నవనీతం - 23వ రేకు
నికర కర కలిత నవనీతం (5-79) అని మార్పు.
అదె వెంకటాచల మఖిల వున్నతము - 4వ రేకు
అదె వెంకటాచల మఖిలోన్నతము (5-21) అని మార్పు.
పద్యకావ్య పరిష్కరణకంటె కీర్తనల పరిష్కరణ చాల కష్టము.

ఈ విషయాన్నే గౌరిపెద్ది వారు :

"ఈ తాళ్లపాకకవుల పదవాఙ్మయమునకు రేకుల పాఠమొక్కటే మూలప్రకృతి.... మనమీ వాఙ్మయమును బరిష్కరింపవలసి వచ్చి నపుడు చాల వింత సమస్యలు ఎదురగు చుండును....వీరి వాఙ్మయ సాగరమున కొంతకాలము మునిగితేలిన వ్యుత్పన్నునికి గాని దీని లోతు తెలియుట కష్టము. మామూలు వాఙ్మయమును చూచిన దృష్టితో కాక దీనిని విశేషదృష్టితో గమనింపవలసిన అవసరమెంతైన కలదు" అని స్వానుభవంతో చెప్పడం గుర్తించదగ్గది.

శ్రీ వేంకటేశ్వరస్తుతి రత్నమాల :

ఈ పుస్తకాన్ని తి. తి. దే. వారు 1951 లో ముద్రించారు. శాస్త్రిగారు పీఠికలో స్తుతి సుందరము ప్రశస్త రచనాశోభితము నయిన ఈ గ్రంథము శ్రీ వేంకటేశ్వరస్వామి భక్తుల నిత్యపారాయణ గ్రంథ ముగా వెలయగలదు అని వ్రాశారు. ఈ పుస్తకంలో రేవణూరి వెంకటా చార్యుల శ్రీపాద రేణుమహాత్మ్యము నుండి 15 పద్యాలు ఒక సుదీర్ఘ ద్విపదను ఉటంకించారు. అలాగే శ్రీ వేంకటేశ్వర శతకం నుండి సుమారు 20 పద్యాలను కూర్చి అందించారు.

3.3.1.1.4. సుభద్రా కళ్యాణం :

శ్రీ వేటూరి వారి పరిశోధనా ఫలితంగా వెలుగులోనికి వచ్చి ప్రథమాంధ్ర కవయిత్రిగా పట్టము గట్టించుకొన్న కవయిత్రి తాళ్ల పాక తిమ్మక్క. ఈ కవయిత్రి రచనకు సంబంధించి రెండు ప్రతు లున్నాయి.

మొదటిది 1910 నాటి గుజిలి కాగితపుప్రతి.

రెండవది శాస్త్రిగారు శ్రీకాళహస్తి రాజావారి ఆస్థానం నుండి సేకరించిన ఒకే ఒక తాళపత్రప్రతి.26 ఇది ప్రస్తుతం శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ప్రాచ్య పరిశోధనాలయంలో వుంది. ఈ ప్రతిని గురించి శాస్త్రిగారు :

"దీనినెంతో దిద్ది కొంత తీరునకు దెచ్చితిమి" అనడంలో వారి పరిశ్రమను అంచనా కట్టవచ్చు. ఈ పుస్తకాన్ని దేవస్థానం వారు విరోధి ఫల్గుణ బహుళ దశమి ద్వితీయవర్షాన్నమాచార్యోత్సవ సమయంలో ప్రకటించారు.

ఈ కృతి తిమ్మక్కదని సాధించడానికి కొందరు వ్యర్థ ప్రయత్నాలు చేశారు. అయితే వారి ప్రయత్నాలు అగడుపడ్డాయనడం మాత్రం వాస్తవం.

తాళ్ళపాక కవులు పలువురు పెండ్లిపాటలకు మంజరీద్విపదలను వాడడం, తాళ్ళపాకవారి సంకీర్తనలలో స్వామి కళ్యాణోత్సవ కీర్తనలు చాలా కనిపించడం వ్రాతప్రతిలో స్పష్టంగా "తిమ్మక్క" అని వుండడం గుర్తించ దగ్గ అంశాలు, కొత్తగా వెలుగులోనికి తెచ్చే గ్రంథాలకు విపుల మయిన పీఠిక వెలువడడం న్యాయమయినా తొందరగా ముద్రణలో ఈ గ్రంథాన్ని అందించాలనే సంకల్పంతో శ్రీ శాస్త్రిగారు చాల సంగ్రహ మయిన పీఠిక వ్రాశారని భావించడానికి వారి శిష్యులయిన శ్రీశ్రీనివాసాచార్యులు, శ్రీసచ్చిదానందం గారి మాటలే ప్రమాణాలు.

4. తాళ్లపాక సాహిత్య ప్రచారం :

తాళ్లపాక కవుల సంకీర్తనల్ని రాగిరేకుల నుండి ఎత్తివ్రాయించినా, ముద్రించినా వాటికి పరిమిత ప్రయోజనం మాత్రముంటుం

దని భావించి శాస్త్రిగారు అన్నమాచార్యోత్సవాల్ని జరపాలని అనుకొన్నారు. దీనికి ప్రధానంగా 5 కారణాలు కనిపిస్తాయి.

1. మదరాసులో సంగీతనాటక అకాడమి, మరి స్వచ్ఛంద సంస్థలు ఏర్పాటు చేస్తున్న సంగీతోత్సవాలు.

2. తమిళగేయాలు ప్రచారం చేయాలని కృషిచేస్తున్న తమిళ్ ఇశై చ్చంగం ధ్యేయంలాగే అన్నమాచార్యుల సంకీర్తనల్ని ప్రచారం చేయాలనే అంతరంగిక సంకల్పం.

3. తమిళదేశంలో నాదబ్రహ్మైక్యమొందిన త్యాగరాజస్వామికి ఆ మహానుభావుడు జీవించిన గ్రామంలో ఆరాధనోత్సవాలు జరుపబడుతుండడం.

4. అన్నమయ్య జయంతి కంటె వర్ధంతి జరిగే తేదీలు పిల్లలకు పెద్దలకు అనుకూలంగా వుంటుందని భావించడం.

5. తిరుమలలో తాళ్లపాకవారి అరలో అన్నమయ్య, పెద్ద తిరుమలయ్యల చిత్రాలున్న రాగిరేకులు బయటపడిన స్ఫూర్తి.

1949వ సంవత్సరం 446వ అన్నమాచార్య వర్ధంతి ఉత్సవం జరగడానికి శాస్త్రిగారే కారకులు. ప్రథమ వర్ధంతి ఉత్సవ ఉపన్యాసంలోని

"కార్యకారణమయిన తనను గానరానీయక కార్యముల నెల్ల జరుపుకొనుచుండు చైతన్యమూర్తి భగవంతుడే. ఆయనయే

---

✤ ఈ ప్రకరణం వ్రాయడంలో ఎన్నో అమూల్య విశేషాలను అందించిన వారు శ్రీ శ్రీనివాసాచార్యులు, శ్రీ సచ్చిదానందంగారు.

ఈ అన్నమాచార్యోత్సవ శరీరమున కంతకును నిర్వాహకుడు. ప్రాణము. ఈ యుత్సవమున పనిగొనియున్న మనమందఱము స్వామి యవయవములము. ఇట్లు చూడగా నేనిందు పాదాంగుష్ఠ స్థానీయుడ ననుకొందును, అనే వాక్యాలే ప్రమాణాలు.

శ్రీ వేంకటేశ్వర వచనములు, అన్నమాచార్య చరిత్రము, సు భ ద్రా క ల్యా ణ ము ల ను ఆంధ్రలోకానికి అందించిన పరిశోధక శిఖామణి శాస్త్రిగారు. శ్రీ వేంకటేశ్వర శతకపద్యంతో అన్నమయ్యను పరిచయం చేయడం మాత్రంకాకుండా సంకీర్తనల రేకుల్ని వింగడించి ప్రచురణకనువుగా సిద్ధంచేసిన మనీషి. ఒక్క మాటలో చెప్పాలంటే శాస్త్రిగారు మహామహోపాధ్యాయులు.

సంఖ్యాసూచికలు :


1. Para 19. page 96. Madras Epigrahical report.
2. Tirupati Sri Venkateswara – Preface - P. 9.
3. Manimanjari I vol - 34-40.
4. పరిషత్ పత్రిక 3.348, 430, 440.
5. శతక వాఙ్మయము – పుట 137.
6. Note by the general Editor to vol IV.
7. అన్నమాచార్యచరిత్రము ప్రా. ప్రతి పుట. 69
8. ” పుట. 112 – 115.
9. ప్రబంధరత్నావళి పీఠిక – పుట 13.
10. ప్రబంధరత్నావళి – 53 పద్యం – 7.
11. శృంగార శ్రీనాథము – 314.
12. వేటూరివారి పీఠికలు – 236.

13. అన్నమాచార్య చరిత్ర పీఠిక - పుట 124.
14. శ్రీవేంకటేశ్వరవచనములు - పీఠిక 17.
15. వేటూరివారి సాహితీ పరివస్య - పుట 169.
16. తాళ్లపాక కవుల కృతులు వివిధ సాహితీ ప్రక్రియలు - పుట 292
17 అన్నమాచార్యుల జీవిత చరిత్రము. (తృ. ము.) వివేక దీపిక - పుట 22
18. శ్రీ. వేం. వి. పిహెచ్ డి. కోసం సమర్పించిన సిద్ధాంత వ్యాసం 1987.
19. " " డా॥ గోవిందరాజు" 1985
20. " " డా॥ జె. మునిరత్నం" 1986.
21. కె. సర్వోత్తమరావు 1984.
22. శ్రీ. వేం. వి. పిహెచ్.డి. కోసం సమర్పించిన సిద్ధాంత వ్యాసం 1984
23. Note by the General Editor to vol VI
24. Tirupati Sri Venkateswara - Page 372
25. గౌరిపెద్ది రామసుబ్బశర్మగారి 1 సం॥ పీఠిక-పుట 19.
26. శ్రీ. వే. వి. ప్రా. పరిశోధనాలయం నెం. 7327.
(a T·T D Collections

# అన్నమయ్య జీవిత తత్త్వం

అన్నమయ్య జీవిత తత్త్వమనే శీర్షికను మూడు రకాలుగా విశ్లేషించ వచ్చు.

1. అన్నమయ్య యొక్క జీవిత తత్త్వం.
2. అన్నమయ్య సంకీర్తనలలో ప్రతిపాదించిన వివిధ వ్యక్తుల జీవితతత్త్వం
3. అన్నమయ్య సంకీర్తనలద్వారా ఉపదేశించిన జీవితతత్త్వం

ఈ మూడు విభాగాలలో మొదటిదయిన అన్నమయ్యయొక్క జీవితతత్త్వం గురించి ముందు పరిశీలిద్దాం.

మానవుల్ని రెండు రకాలుగా వర్గీకరించవచ్చు. సామాన్యులు, మహాత్ములని. సామాన్యుల జీవితంలో ఆటుపోటులుగాని, ఎదుగుపొదుగులుగాని అంతంత మాత్రమే. అయితే మహాత్ముల జీవితం "ఇంతింతై వటుడింత"గా సీమలు దాటిపోయిన జీవితం. అసలు వ్యక్తులు సామాన్యులయినా మహాపురుషులయినా వారి జీవితాలను విశ్లేషించడానికి కొన్ని కొలబద్దలు అవసరం. వాటిని మూడు రకాలుగా వర్గీకరించ వచ్చు.

1. విశ్వాసానుబంధి
2. వంశానుబంధి లేదా పరిసరానుబంధి
3. సంఘటనానుబంధి

విశ్వాసానుబంధి :

విశ్వాసమంటే నమ్మకమని అర్థం. ఎవరు ఎంత చెప్పినా నమ్మకమన్నది హృదయానికి సంబంధించిన విషయం. ఈ నమ్మకం కూడా రెండు రకాలు.

1. అలౌకిక విశ్వాసం.
2. శాస్త్ర విశ్వాసం.

**అలౌకిక విశ్వాసం :**

ఒక వ్యక్తి జన్మకు అవతారాలను పేర్కొనడం, పురాణ కథల్ని జతపరచడం, పుట్టుకకు కారణమయిన మహిమల్ని విశదీకరించడం మొదలయినవి అలౌకిక విశ్వాసాలు. చారిత్రక వ్యక్తులకు దైవాంశ నిర్ధారించడం ఇందులో ప్రధాన విషయం. భగవద్రామానుజుల వారిని ఆదిశేషావతారులుగా, లక్ష్మణస్వామిగా చెప్పడం, మధ్వాచార్యులవారిని హనుమదవతారంగా, భీమావతారమూర్తులుగా భావించడం ఈలాంటివే. ఈ జోడింపు మతప్రవక్తలకు మాత్రంకాకుండా మత ప్రచారకులకు కూడా చెప్పడం వుంది. వేదాంత దేశికుల్ని శ్రీవేంకటేశ్వరస్వామి గుడిగంట అంశంగా భావించడం ఈలాంటిదే. అలాగే అన్నమయ్యస్వామి నందకాంశంతో జన్మించాడనడం అలౌకిక విశ్వాసానుబంధి. తరాలు మారేకొద్దీ, ప్రచారవేగం పుంజుకొనేకొద్దీ ఈ కథలు విస్తరించవచ్చు. అయితే అన్నమయ్య మనుమడు ఈ వివరణ ఇవ్వడం ప్రత్యేకత.

"బిరుదు గజ్జియల ముప్పిది కరారంబు
కలలోన నొసగ" అని చిన తిరువేంగళ

నాథుడు గ్రంథస్థం చేశాడు. వైష్ణవులు నిత్యపారాయణముచేసే పంచాయుధ స్తోత్రంలో "నందకస్తవం" వుంది. ఈ విశ్వాసం ముదిరి ముదిరి

"తుంబురుడో నారదుడో కాక యీవి
ధంబున దిరుగు గంధర్వుడో కాక
మనుజుడో యీ యన్నమయ"

అనే వూహకు అవకాశమిచ్చింది. చివరకు నందకాంశం పోయి,
గంధర్వాంశమును వెనక్కి నెట్టి

"హరి యవతార మీతడే అన్నమయ్య" అనే దాకా సాగింది.
మోకాలి మిట్ట ఎక్కేవేళ అమ్మవారు ప్రసాదాలు ఇవ్వడం, తిరుమల
చేరిన వేళ దర్శనార్థం వేచినవేళ స్వామి ఆలయం తలుపులు పెళ
పెళ తెరవడం, సాళువ నరసింహరాయలు వేయించినసంకెళ్ళు వూడి
పోవడం, పుల్లని జీడిమామిడి తియ్యమామిడిగా కావడం మొదలయిన
వాటిని అలౌకిక విశ్వాసాలుగా భావించవచ్చు.

శాస్త్ర విశ్వాసం :

అలౌకిక విశ్వాసం కంటె కూడా శాస్త్ర విశ్వాసం కొంతమెరుగు.
ఎన్నో వేల సంవత్సరాలనుండి లక్షలాది ప్రజల జీవన స్థితుల్ని జత
చేసి వడబోసి తీర్చిన సిద్ధాంత గ్రంథం జ్యోతిష్యం. ఆస్తిక్యం ఆవ
గింజంత వున్నవారికి ఈ శాస్త్రం పట్ల గౌరవం ప్రమాణం రెండూ
వుంటాయి. పిల్లవాడు పుట్టగానే సిద్ధాంతి దగ్గరికి వెళ్ళి బాగోగులు
చూడమనడం మనలో చాలమందికి అలవాటే. ఈ సంప్రదాయాన్ని
తరిగొండ వెంగమాంబ జలక్రీడా విలాసంలో రమణీయంగా వర్ణించింది.

ఓ పురోహిత! బహునాళ్ళ కుర్వి మీద
నాకు పుత్రుడు పుట్టియున్నాడు వాడు
జనన మొందిన దివస నక్షత్ర లగ్న
ముల ఫలంబులు జెప్పవె ముదముతోడ

అన్నమయ్య జనన కాలానికి సంబంధించిన చిన్నన్న వర్ణన కూడా గమనించదగ్గది.

"చక్కని గ్రహము లుచ్చమున మూడలర
అనుపమ లగ్నము నందు వైశాఖమున
విశాఖను జగంబున నుల్లసిల్ల
జనియించె నన్నమాచార్యుండు"

నక్షత్రాలలో విశాఖ, 1,2,3, పాదాలు తులారాశికి సంబంధించినవి. తుల అంటే త్రాసు. ఈ రాశిలో పుట్టిన వారు కష్టసుఖాల్ని, లాభనష్టాల్ని, మానావమానాల్ని సమంగా సమన్వయించుకుంటారు. గీతలో చెప్పిన "పండితా సమదర్శినః" అనే మాట వీరికి చక్కగా అతుకుతుంది. అదీ గాక ఈ వర్ణన వల్లనే అన్నమయ్య క్రీ.శ. 1408 నాటి వాడా లేదా క్రీ.శ. 1424 నాటివాడా అని నిర్ధారించడానికి వీలయింది. "చక్కని గ్రహములు మూడుచ్చమున నిలువ" అనే వాక్యంబట్టి ఎపుడు మూడు గ్రహాలు ఉచ్చంలో ఉంటాయో అన్నమయ్య జీవితాన్ని బట్టి జాతక చక్రము వేసి క్రీ.శ. 1424 నాటి వాడని డా॥ ముట్నూరు సంగమేశం గారు నిర్ణయించారు. ఈ రంగంలో డా॥ అబ్బూరి గోపాలకృష్ణగారు కూడా కృషి చేశారు.

పరిసరానుబంధి లేదా వంశానుబంధి :

ఒక వ్యక్తి జీవితాన్ని స్థూలంగా తెలుసుకోవడానికి వుపకరించే మరొక సాధనం పరికరం మరి వంశాదికం. ఈ రెండూ మనిషిని తీర్చి దిద్దడానికి వుపకరిస్తాయి. అన్నమయ్య అంత గొప్పవాడు కావడానికి అతని వంశం కూడా కారణం. తాత నారాయణయ్య గ్రామదేవత "చింతలమ్మ" అనుగ్రహం పొందినవాడు. ఆ శక్తి

"అలరుచు సకల విద్యలు నీకు వచ్చు
అదియునుగాక మూడవ తరంబునను
వదలని కీర్తి మీ వంశంబునందు
పరమభాగవతుడు ప్రభవించు శౌరి

వరమున జగదేక వల్లభుడు అని అనుగ్రహించింది. అలాగే నారాయణయ్య జటాంతం చదువుకున్నాడు. తండ్రి నారాయణసూరి. సూరి అనే మాటబట్టి అతడెంత చదువుకున్నాడో తెలుస్తున్నది. పైగా అతని ఇల్లాలు లక్కమాంబ. మాడుపూరు మాధవుని భక్తురాలు. ఆ స్వామి లక్కమాంబతో "తోడునీడై యామెతో మాటలాడే" వాడట. ఏతావతు అన్నమయ్య కారణ జన్ముడు. అహోబలమఠం ఆదివన్ శఠగోపయతి దగ్గర చదువుకోవడం వల్లకూడ అన్నమయ్య "అంతటి" వాడు కాగలిగాడు.

సంఘటనానుబంధి:

వ్యక్తుల వ్యక్తిత్వ వికాసంలో సంఘటనలకెంతో ప్రాధాన్యం. ఈ సన్నివేశాలను మూడు రకాలుగా వర్గీకరించవచ్చు.

1 దశానుబంధి
2 దృక్పథానుబంధి
3 ప్రవృత్త్యనుబంధి

దశానుబంధి:

ఒక వ్యక్తి జీవితంలో బాల్యం, కౌమారం, యౌవనం, వార్ధక్యం, అనేవి దశలు. ఆయాదశలలో వ్యక్తు లెదురొన్న సన్నివేశాలద్వారా సామాన్యుల జీవితాల్ని ఈ వర్గీకరణద్వారా తేల్చి చెప్పవచ్చు. ఇందులో

క్రమపరిణతి, ఉచ్ఛనీచాలుంటాయి. అయితే మహాత్ముల విషయంలో ఔన్నత్యమే వుంటుంది. కనుక ఈ కొలబద్ద సరిపోదు. కాకపోతే "బాల్యంనాటి" సంఘటనలకు కొంత విలువ వుంటుంది. ధ్రువ, ప్రహ్లాదులు, ఆధునికులలో రమణ మహర్షి బాల్యజీవితం గమనించవచ్చు. అన్నమయ్య జీవితంలోను బాల్యసంఘటనే ఒక మలుపు.

"ఇంటి వారలు పిల్చి యేమి చెప్పినను
గెంటనాడక పరికించి సేయుచును
జననియు నన్నయు జనకుండు వదినె
యును గొన్నిపనులు సేయుచు దన్ను బిలిచి
పసులకు కసవుదే బనుప బాలుండు
పెన నేగి ........ ఒక పిడికెడు కోసి మఱియు
కసవు గోయగబోయి కడ వ్రేలు సోకి
పడియు నెత్తురు సూచి వా।కుచ్చి శౌరి
యడుగులు దలచి శ్రీహరిహరీ యనుచు
నీ కోత కొలది నా దెఱిగిన వదినె
చేకోత వడగాదు చీరోత యనుచు" కదలడం.

దృక్పథానుబంధి :

సమకాలీన సమాజంలో ఏవయితే ప్రజల్ని శాసిస్తున్నాయో వాటిపట్ల వ్యక్తులకున్న అభిప్రాయాలు దృక్పథానుబంధి వర్గంలో చేరతాయి. ఈ వర్గీకరణలో బాల్యాది దశలకు ప్రాధాన్యం లేదు. రాజకీయం, మతం రెండూ అనాటి కీలకాంశాలు. అన్నమయ్యకు వాటిపట్ల వున్న దృక్పథం గమనించదగ్గది.

అన్నమయ్య కాలంనాటికి విజయనగరాన్ని సంగమ వంశీయులు, సాళువ వంశీయులు పరిపాలించేవారు. వారి కాలంలోనే రాజ్యంకోసం అన్నదమ్ములు తన్నుకోవడాన్ని అన్నమయ్య గర్హించాడు. సంగమ వంశీయుడయిన రెండవ బుక్కరాయలు (1405-1406) అన్నను తరిమి తాను సింహాసన మెక్కాడు. అయితే మొదటి దేవరాయలు మరల అన్నను తరిమి (1406-1422) దాకా రాజ్యమేలాడు. ఈ దేవరాయల్ని ప్రథమదేవరాయలు విందుకు పిలిపించి చంపడానికి ప్రయత్నం చేశాడు. అలాగే రెండవ విరూపాక్షరాయలు మల్లికార్జున రాయల కుమారుల్ని చంపి తాను రాజైనాడు. ఈ పరిణామాలను అన్నమయ్య గర్హించాడు.

> దేహమిచ్చిన వాని దివిరి జంపెడు వాడు
> ద్రోహిగాక నేడు దొరయటా
> తోడబుట్టినవాని తొడరి జంపెడువాడు
> చూడ దుష్టుడుగాక సుకృతియట
> కొడుకు నున్నత మతిగోరి చంపెడువాడు
> కడు పాతకుడుగాక"

అనడంలో ద్రోహి, దుష్టుడు, పాతకుడనే మాటల్లోని తీవ్రత గుర్తించదగ్గవి.

మత దృక్పథం :

మతం నాటికి నేటికి చాల శక్తివంతమయిన సాధనం. మతం పట్ల అన్నమయ్య అభిప్రాయాలు.

> కలవు మతములు పెక్కు కర్మభేదంబు లగుచు
> వింత చదువులవల్ల వేవేమతములందె

ఎక్కడి మతములింక నేమి సోధించేము
తగు దైవ మొకడే తమ మతములే వేరా

పైగా అతని కాలము నాటికి "ఆరు మతాల" ప్రభావం వుందేమో

"వాటిక నారుమతాలవాడై తిరుగుకంటే
యీడనే శ్రీపతి వారై యీడేరరో"

అని చెప్పాడు. షణ్మతాలు కావచ్చు. షట్శాస్త్ర మత విభేదాలు కావచ్చు.

ప్రవృత్తి అనుబంధి:

ప్రవృత్తి అనే మాటకు స్వభావమని అర్థం. మానవుని ప్రవృత్తుల్ని గుణాలుగా సాత్త్వికమని, రాజసమని, తామసమని వర్గీకరించడం ఒక పద్ధతి. దీనినే కొంచెం నాజూకుగా ఆమోద ప్రవృత్తులు, ప్రమాద ప్రవృత్తులని విశ్లేషించవచ్చు.

ఆమోద ప్రవృత్తి:

అందరికి సమ్మతమయినది ఆమోదం. ఈ విధానంలో ఇతరుల్ని నొప్పించకుండడం, ఇతరుల కోసం తాను గిరలు దాటడం రెండూ వుంటాయి.

వైష్ణవమంటే తమిళ మతమనే అభిప్రాయముంది. ఆళ్వారులు కీర్తించిన దివ్యదేశాలలో రెండే, తిరుపతి అహోబిలం ఆంధ్రదేశంలో వున్నాయి. అందువల్ల అన్నమయ్య దేశ సంచారిగా తిరుగుతూ దివ్యదేశాలను పెంచాడు. వైష్ణవం అందరిదీ అనే భావన కలిగించాడు. ఇందులోని భాగమే హనుమదారాధన, [illegible] ఆరాధన, జగన్నాథ ఆరాధన, విఠల ఆరాధన, గోరక్షనాథ ఆరాధన మొదలయినవి,

ఈ కారణాలవల్ల వైషమ్యం తగ్గడానికి వీలయింది. ఇతర వాగ్గేయ కారులు "ఆదాన ప్రదాన" సూత్రం అవలంభించడానికి వీలయింది. పురందరదాసులు వారుకూడా ఈలాగే శ్రీనివాసుని

దయమాతో శ్రీ బెట్టద పురందర విఠల
ఇదె పురందర విఠల నిద్దరవు మ
త్తిదే తిరువెంగళప్పన మూరుతి ఇదే" అని అన్నాడు.

ప్రమోద ప్రవృత్తి :

ప్రమోదమంటే సంతోషం. ఈ ప్రవృత్తిలో విశ్వాసం, భక్తి విశేషంతో శరణాగతి పాటించడంలాంటివి చెప్పవచ్చు.

ఏమివలసిన నిచ్చు నెప్పుడైనను
ఏమరక కొలిచిన నితడే దైవము
ఆకలి వేళల నలపైన వేళలను
తేకువ హరినామమే దిక్కు మఱిలేదు

అనేవి విశ్వాసమునకు సంబంధించిన అంశాలు.

నా వల్ల నీకేమున్నది నారాయణ నీవు నన్ను
కావించి రక్షించే వుపకార మింతేకాక

అనడంలో శరణాగతి కనిపిస్తుంది. మధుర భక్తితో దేవుని కొలవడం ప్రమోద ప్రవృత్తి.

ప్రమాద ప్రవృత్తి :

కోపపడటం, ద్వేషం పెంచుకోవడం, ఇతరుల వినాశనాన్ని కోరడం లాంటివి ప్రమాద ప్రవృత్తులు.

ఎవరో అన్నమయ్యను బాగా బాధపెట్టినపుడు

నరసింహ ! రామకృష్ణ ! నమో శ్రీవేంకటేశ
సరగ నాశత్రువుల సంహరించవే
బావ తిట్లకు శిశుపాలుని జంపిన
యేవ కోపకాడవు నేడెందువోతివి
నీవాడనని నన్ను నిందించీ, శత్రువును
చావగొట్టి వానినట్టె సంహరించవే"

అనడం. అలాగే అసహ్య ప్రవృత్తి. అన్నమయ్య తన కీర్తనల్ని అనుకరించే తస్కరించే పదకవుల్ని గర్హించాడు.

వెట్టులాల మీకు వేడుక కలిగితేను
అట్టువంచి తడు కల్లంగ రాదా
ఉమిసెన తమ్మలో నొక కొంత క్రమము
సమహూర్చి చవిగాని చప్పరించనేల
అమరగ చాయాపహారము చేసుక
తమ మాట గూర్చితే దైవము నగడా

వైరాగ్య ప్రవృత్తిని అలవరచుకోక ఇహాని కోసం దేబరిస్తూ తన్ను చీటికి మాటికి ఇబ్బంది పెట్టే స్వలాభపరుల్ని ఈసడించుకోవడం

విసిగి నే విడిచినా వీడువరు లోకులు
కొసరేరు ముసరేరు కోరిక దీర్చుమనేరు
వసలేని పనులకు బడల నే నోపను

అన్నమయ్య సంకీర్తనలలో ప్రతిపాదించిన వివిధ వ్యక్తుల జీవితతత్త్వం పరిశీలిద్దాం.

వాగ్గేయకారులలో దీర్ఘాయుష్మంతుడు సంచారశీలి, పద్యపద కవితల్ని అభిమానించిన వారలలో అన్నమయ్యకు సాటి మరెవరూ లేరు. ప్రజల మధ్య తిరుగుతూ ప్రజలకోసం పదాలు పాడినవాడు. అతని రచనల్లో రైతులు, వైద్యులు, ఉప్పమ్మేవాళ్ళు, కమ్మరి, కుమ్మరి చాకలి, గొల్ల, బొమ్మలాటలాడేవారు, ఇతర నిమ్నజాతులు, కనిపిస్తారు. వారి వారి స్వభావాన్ని భక్తికి అనుబంధంగా తీర్చడం అన్నమయ్య వంతు. దీనికి చక్కని ఉదాహరణ బోయనాయని పాట.

పొలసి మీసాల పెద్ద బోయ నాయుడు
మలగి వీపున గట్టి మంకు బోయనాయుడు
పొలము రాజై తిరిగే బోయనాయుడు

కెలయ మోమునమండే వేట బోయనాయుడు. ఇందులో అన్నమయ్య కాలంనాటి బోయనాయకుల వేషం, పైగా స్వామి దశావతారాలు కనిపిస్తాయి.

ఈలాగే పేదల బ్రతుకును వర్ణిస్తూ దశావతార రహస్యాల్ని వివరించాడు.

ఇట్టునట్టు మిట్టిపడ్డ యించుకంతా లేదు వీపు
బట్టగట్ట మోపుమోచి పాటుపడ్డా లేదు
తట్టుపడ లోకమెల్ల తవ్వుకొనినా లేదు
తెట్టతెరువున నోరు తెరిచినా లేదు

అనడంలో సామాన్య వ్యక్తి ఎంతగా శ్రమించినా మిగలక పోవడం వంటివి కనిపిస్తాయి.

ఈలాంటి వ్యక్తుల్నే కాకుండా రకరకాల వ్యక్తుల స్వభావాల్ని అన్నమయ్య వర్ణించాడు. ఇందులో అతని లోకజ్ఞత స్పష్టమవుతుంది. మచ్చుకు—

పాప ప్రవృత్తి :

తీపు సంజీవేళ నట్టే తేట బులాసింపాను
పైపై బుణ్యమయితే బావమింపౌను.

మోహ ప్రవృత్తి :

పెక్కు పురుషులలోన పెరపొక సతియుంటె
యిక్కువై యుండే నాటు నిందరి చూపు

దైవనింద ప్రవృత్తి :

తనకు సంతిసమైతే తన భాగ్యము వాగడు
తనకు జింత పుట్టితే దైవము దూరు

సహ్యాసహ్య ప్రవృత్తి :

సరినిన్న భుజియించి చాలునన్న యన్నమే
అరిది నేడప్పటిని నాసరేచీని
మాయగట్టి విడిచిన మలినపు గోకలు
యీాయెడు నుదికి తేనే యిచ్చరే చీని
కాయముపై మోచి పెట్టె గట్టివేసిన సొమ్ములు
మాయలై దినదినము మమతరేచీని
పొది వరస్తుతి పుణ్యము కంటె
పొదుగ హరి దిట్టే పావము మేలు

ఆర్భాట ప్రవృత్తి :

తన గుట్టల్లా నెరిగిన వారలముందట
తన ఎమ్మెలు చెప్పుకొనుట రోత

మానవుడు తన జీవితకాలంలో ఎలా వుండాలో నిర్దేశించడం "అన్నమయ్య జీవిత తత్త్వంతో" ఒక భాగమవుతుంది. మహాశివతులా మహారాజులలాగా కాకుండా సామాన్య వ్యక్తులతో పరిచయం పెంచు తున్నవాడు కావడం వల్ల అన్నమయ్య వారి జీవిత ధ్యేయమేమిటో లక్ష్యమేది వుండాలో నిర్దేశించాడు.

సమాజంలోని సమస్యలు మూడు రకాలు. వ్యక్తి సమస్య- కుటుంబ సమస్యలు, సాంఘిక సమస్యలు, వ్యక్తి సమస్యలలో ఆవేదన ప్రధానంగా వుంటుంది. ఈ సమస్యల వర్ణనల్లో తాను పడ్డ బాధలు ప్రధానంగా వుంటాయి. ఇవి పైకి అన్నమయ్యవిగా కనిపించినా అవన్నీ అందరివే.

ఉదా : a) ఎందరికి గొడుకుగా డీజీవుడు వెనక
సెందరికిదో బుట్టడీ జీవుడు
ఎందరిని భ్రమయించడీ జీవుడు-దుఃఖ
మెందరికి గావించడీ జీవుడు

b) కడు పెంత తాగుడుచు కడుపెంత దీనిపై
పడని పాటులనెల్లబడి పొరలనేలా

c) ఎన్ని బాధలబెట్టి యేచెదవు నీవింక
ఎంతకాలము దాక కర్మమా
మన్నించుమనుచు నీ మఱుగు జొచ్చితిమి
మామాటల కింపవో కర్మమా

d) బ్రాహ్మణుడ ననుటే కాని దేహము
కోరి యాచారమునకు కొలుపదు
పేరు వైష్ణవుడననే పెద్దరికమే కాని
సారమైన మనసులో జ్ఞావకమే లేదు

కుటుంబ సమస్యలు :

కుటుంబ సమస్యల్ని 3 రకాలుగా వర్గీకరించవచ్చు. మొదటి వర్గంలో ఆర్థిక సమస్యలు. రెండవ వర్గంలో బంధుజనాదులవల్ల కలిగే సమస్యలు. మూడవ వర్గంలో ఆలుమగలకు సంబంధించిన సమస్య లుంటాయి.

ఉన్నవారిలోనయినా లేనివారిలోనయినా ఆర్థిక సమస్యలు వుం డనే వుంటాయి. ఈ సమస్యలవట్ల ఏలా వుండాలో అన్నమయ్య

అప్పులేని సంసారమైన పాటే చాలు
కంతలేని గుడిసొక్క గంపంతయిన చాలు
చింతలేని యంబలొక్క చేరడే చాలు"

అని "తృప్తికిని" వేరేమార్గం నిర్దేశించాడు. డబ్బుంటే అన్నీ సాధించే వాళ్లం కదా అనే వ్యక్తుల్ని చూసి

సిరుల కల్గిన ఫలము చింత పొరలనె కాని
పొరిది సంతోష మించుకయైన లేదు''

అన్నాడు. ఇది ఈనాటి నాగరిక జీవితానికి కూడ అన్వయించే విషయం.

వెతల పొరలే ఘన విభవము కంటే
అతి పేదరిక మది "సుఖము" అన్నదే

అతని నిర్ణయం.

ఇక బంధుజనాదుల వల్ల కలిగే సమస్యలు. అన్నమయ్య ఈ విషయంలో కూడా ప్రజలకు హెచ్చరిక వేశాడు. కలిగినవాడే చుట్టరికంబుల తిరుగులివి 8-68.

"పొట్ట పొరుగు చుట్టాలు భోజన సహాయులే"
"అంతహితులా తనకు నన్నలును తమ్ములును
వంతు వాసికి పెనగువారే గాక"

ఆలుమగలకు సంబంధించిన సమస్యలు:

అన్నమయ్య మగవాడయినా సంకీర్తనలలో చాల చోట్ల మగవానిపై కొన్ని విసురులు విసిరాడు.

"నీవు మగవాడవు నీవెట్టుండినా చెల్లు"
"మగవాడెంత చక్కని మగువ కలిగినను
మిగుల వేరొకతెతో మేలమాడును"
"సతిలేని వానికి జరిగినదే యాలు"

ఏవోకొన్ని పొరపొచ్చాలవల్ల సంసారంలో తుఫానుగాలులు వీచవచ్చు. ఆ సందర్భంలో "పెద్దమనిషిగా" అన్నమయ్య హితబోధచేసిన సందర్భాలెన్నో కనిపిస్తాయి.

"పతితోడ సతికి పంతము లాడందగదు
మితిమీరి గర్వమున మించంగ దగదు
తతితోడం గాతరించి తప్పులు సేయందగదు
చతురత సారెసారె సాధించదగదు"

అని ఆడవారిని మందలిస్తూ

వలచిన ఆడవారు వాదులాటకు వచ్చిన

చలము సాధించువాడు జాణడాలాడు అని

"మగవాడిది యెరిగి మగువల నేలవలె" అని హితోక్తులు పలికాడు.

సాంఘిక సమస్యలు :

సంఘానికంతటికిని సంబంధించినవి సాంఘిక సమస్యలు. మనం అనేకసార్లు మనకు ఇష్టం లేకపోయినా సంఘం కోసం కొన్ని పనులు చేస్తుంటాం. పండుగలు, పబ్బాలు, పెళ్ళివేడుకలు, తీర్థయాత్రలు మొదలయినవి. ఇవి పరమార్థాలు కానేకావు. అతని దృష్టిలో

వలపుల మొక్కు దీపావళి కానికె

కలయిక మాటలు వుగాది కానికె

అలాగే

"కనుగొను నీ విగ్రహమే గ్రహణలమిది నాకు"

అని నవగ్రహాదుల బలాన్ని పరిహసించాడు

"నిరపరాధుల చంపి నెత్తురు వారించగలను

తెరలక ఎట్లుండిరో దిక్పాలకులు

విరస వర్తనులుండే విపరీతకాలమున

గలువాలుం గపటావె కలికాల మహిమ

అనడంలో ప్రజలెదుర్కొంటున్న బాధల్ని వ్యక్తం చేస్తూ "తావుకోకే దొరలకు దయ రాదాయె" నని ఈసడించుకున్నాడు.

పరానికి సంబంధించన జీవితతత్త్వం :

ఆహార నిద్రా భయమైథునాలు మనిషికి జంతువుకూ సమానం కాని మానవుడు విశిష్టుడు కావాలంటే "జీవిత రహస్యాన్ని" తెలుసుకోవాలి. ఈ విషయాన్నే ఆదిశంకరులు.

"బాలస్తావత్క్రీడాసక్తః తరుణస్తావత్ తరుణీసక్తః
వృద్ధస్తావత్ చింతాసక్తః పరమే బ్రహ్మణి కోపినసక్తః

అని చెప్పారు. పరానికి సంబంధించిన జిజ్ఞాస విస్తృతమయింది. ఈ జిజ్ఞాస కలగడానికి మొట్టమొదట కుల, మత, తన, మన పరిధులు దాటాలి. అందువల్ల అన్నమయ్య మొదట వీటిని తిరస్కరించాడు.

వర్ణం : "సహజపు వర్ణాశ్రమము అవెల్లా
యిహమున తాధరించుసవి"
"వట్టి నటరాజసాలు
వర్ణాశ్రమములు"

కులం : "ఏ కులజు డేమి ఎవ్వడైననేమి
ఆకడనాతడె హరి నెఱిగినవాడు"
"కులమెంతకలిగినా
కూడించుగర్వంబు"

జాతి : "జాతి చండాలము తీరు జన్మాంతరములకు
ఏకుల కర్మ చండాల మెన్నడూ పోదు"
జాతి భేదములు శరీర గుణములు
జాతి శరీరము తోడనే చెడు"

మనం సత్యమని ఏదనుకొంటున్నామో అవి సత్యంకావని నిరూపిస్తూ మోక్షంకేసి త్రిప్పడం అన్నమయ్య పద్ధతి. ఇందులో సంసార నిరసనం, కాంతా నిరసనం మొ॥ చేరతాయి.

కనకం : ఒకని రాజుంజేసు నౌకరి బంటుగ జేసు
ఒకరి కన్నెకలు వేరొకరికి నమ్మించు

కొందరి పుణ్యుల జేసు కొందరి పాపుల జేసు
కొందరి కొందరిలోన కొట్లాట పట్టించు

కాంతా నిరసనం : పందెమాడినటువలె పచరించువసితీ
ఆసపడితే ఇంతులు అన్నిటాను బిగుతురు
వాసితో నుంటేనే తామే వత్తు రొద్దికి

సంసార నిరసనం : జమునోరిలో బదుకు సంసారము చూడ
చమురుదీసిన దివ్వె సంసారము
సమయించు జెనుదెవులు సంసారము చూడ
సమరంబులో నునికి సంసారము
కడలుదీసి నీరాడగా దలచు వారలకు
కడలేని మనసుకు గడమ ఎక్కడిది

మానవ జన్మ మెత్తినవాడు ఇహలంపటాలకు లోనుగాక శ్రీని వాసునిపట్ల భక్తి తత్పరుడై వుండాలనేదే అన్నమయ్య ప్రబోధించిన జీవితతత్త్వం. ఈ కారణం వల్లనే అన్నమయ్య శ్రీనివాసుని గొప్ప తనాన్ని కీర్తించాడు. పౌరాణిక భక్తులతోబాటు చారిత్రకవ్యక్తులయిన అనంతాళువారు, తిరుమల కురువరనంబి పెరియాళ్వారుల చరిత్రలను జోడించాడు. పైగా "జాతర దైవాలసరిగాక" నెంచేవారిని ఈసడించు కున్నాడు. మనోనిగ్రహ ఆవశ్యకతను రమ్యంగా వర్ణించాడు.

(a) బట్టబయలు దోలితేను బందెమేయు బసురము
వట్టి మేపితేను తన పనులు సేయు
ఇట్టె వదలితేను ఎందైనా బారు మనసు
కట్టక నేమస్థుడైతే కైవసమై యుండును

చేవదలితే పెంచిన చిలుకైనా మేడలెక్కు
రావించి గూట బెట్టితే రామాయనును
భావించ కుండితే యిట్టెపారు నెంద్రైనా మనసు
శ్రీ వేంకటేశు గొల్చితే చేతజిక్కి వుండును.

(b) కడలుడిపి నీరాడగా దలచు వారలకు
కడలేని మనసుకు గడమ యెక్కడిది.
చివరగా అన్నమయ్య అందరికి అందించే సందేశం.
"మహినుద్యోగి కావలె మనుజుడైనవాడు
తెలిసితే మోక్షము తెలియకున్న బంధము.



# సంకీర్తనలలో సామాన్య మానవుడు

మానవుడు సంఘజీవి. సంఘమనే పెద్ద యంత్రంలో ప్రతి వ్యక్తి ఒక మరలాంటివాడే ఈలాంటి సంఘంలో ఒకడు సామాన్యుడు? మరొకడు సామాన్యుడు కాదని విడదీయడానికి కొలబద్దలేవయినా ఉన్నాయా అన్నది ఆలోచించవలసిన విషయం ఒకప్పుడు అగ్ర వర్ణేతరులు సామాన్యులనే ఆలోచన ఉండేది. మారుతున్న కాలంలో ఈ విభజన అర్థరహితం. ఆర్థిక ఇబ్బందులతో సతమతమయ్యేవాడు సామాన్యులని కొందరి అభిప్రాయం. డబ్బూ దస్కత్తు వున్నా సామాన్యునిలా జీవించేవారు సంఘంలో ఉన్నారు. అధికారం చెలా యించే వారికంటె బతుకంతా అడుగులకు మడుగులొత్తుతూ కాలం గడిపేవారు సామాన్యులని మరి కొందరంటారు. కాని నిజంగా ఆలోచిస్తే వీటన్నిటిలోను అతివ్యాప్తి అవ్యాప్తి దోషాలున్నాయి. ఈ సామాన్య అసామాన్య విభాగం కాలానుగుణంగా గిరగీసుకోవలసిన విషయం. సంఘంలో పగటు మనిషికి వున్న ఆలోచనాసరళి కల వారిలో ఉన్నా కార్మికులలో వున్నా, బక్కవానిలో ఉన్నా బలవంతు లలో వున్నా వారంతా సామాన్యులని లెక్కగట్టడం ఒక పద్ధతి.

ఈ రోజుల్లో "సామాన్యుని కోసం సాహిత్య" మనే నినాదం విన బడుతుంది. జానపద సాహిత్యంలో సంకీర్తన సాహిత్యంలో సామా న్యుడే శ్రోత వినిపించేవాడు. సమాజంలో నలుగురి మధ్య పారాడుతూ వారి అభిప్రాయాల్ని అందంగా స్పష్టంగా చెప్పే వ్యక్తి ఈ దృష్టితో పరిశీలిస్తే ముప్పయి రెండువేల సంకీర్తనలు వ్రాసిన అన్నమయ్య సామాన్యుడే. అన్నమయ్య సంకీర్తనల్లో సామాన్య మానవుని ఆలో చనా సరళి ఏలా ఉందో చూద్దాం.

భారతదేశంలో నాటికీ నేటికీ మతం, భాష రెండూ శక్తివంత మయిన సాధనాలు. మరి ఐదు శతాబ్దాల క్రితం చెప్పవనిలేదు. ఆరోజుల్లో కర్ణాటాంధ్ర ప్రాంతంలో ఎన్నో మతాలుండేవి. ఇవన్నీ చాలక మరికొన్ని ఆరాధనలు ఆంధ్రదేశంలో పాకుతున్నాయి. ఇవన్నీ చూస్తుంటే పండితుల సంగతి అటుంచి పామరులకు దిక్కుతోచని పరిస్థితి ఏర్పడింది. మతం గురించి అన్నమయ్య అక్కడక్కడ చేసిన వ్యాఖ్యలీ విషయాన్ని పట్టిస్తున్నాయి.

| | |
|---|---|
| ఎక్కడి మతములింక నేమి సోదించేము నేము | 2_52 |
| అన్ని మతములు సరిసైతేను వాసి లేదా | 2_170 |
| వింత చదువులవల్ల వేవే మతాలు కంటి | 2_258 |
| కలపు మతములు పెక్కు కర్మ భేదంబులగుచు | 8_255 |
| పెక్కు మతములు చూచి బెండుపడ్డ వారులేరా | 2_495 |
| వాటిక నారుమతాల వాడై తిరుగుకంటే | |
| యీడనే శ్రీపతి వాడై యీడేరరో | 9_279 |
| తగు దైవమొకడే తమ మతములే వేరు | 8_261 |

అన్నమయ్య వందవరీకుడయినా ఆత్మానుభూతిని పెంచుకొన్నది వైష్ణవంలోనే. వైష్ణవమంటే రామానుజ మతమనే అభిప్రాయం ఆంధ్రదేశంలో ఉండేది. కాని వైష్ణవుల దివ్యదేశాలలో రెండుతప్ప తతిమావి తమిళనాడులోనే ఉన్నాయి. తమది కాని మతం, తమ ప్రాంతంలో లేని వేల్పుల మతమనే భావన కొద్దోగొప్పో సామాన్యులకు ఉండి ఉండాలి. అంచేత అన్నమయ్య ఆళ్వారులలానే ఆంధ్రదేశమంతా తిరుగుతూ కనబడిన ఆలయాలు చుడుతూ పాటలు పాడుతూ దివ్యదేశాల సంఖ్య పెంచి ఇది మన మతమనేభావన ప్రజల్లో

కలిగించాడు. ఈలాంటి కృషి ఏవాగ్గేయకారుడూ చేయలేదనేది పరిశోధకులకు మాత్రం తెలిసిన విషయం. ఒక మహత్తర ప్రయోజనం కోసం కృషి చేస్తున్నప్పుడు వివేదాలు విస్మరించడమనే దృష్టితోనే అన్నమయ్య ఆంధ్రదేశంలో అడుగుపెట్టిన రాధామాధవ ఆరాధన, విఠలారాధన, హనుమదారాధనలాంటి వాటిని ఆదరించాడు. ఈ వర్గ జాపం వల్ల కర్ణాటాంధ్ర ప్రజల మధ్య సాహిత్యం పెరగడానికి వీలయింది. అన్ని మూర్తుల్ని వేంకటేశ్వర ప్రతిరూపాలుగా భావించడం అతనికే సరి.

"ఈ మూరితా పాండురంగముండు ఇరపై వున్నవాడు"

లాంటి వాక్యాలు నిదర్శనాలు.

మతం తరువాత చాల బలవత్తరమయింది జాతి. ఈ జాతికి సంబంధించిన పరిశీలన అన్నమయ్యలో రెండు రకాలుగా ఉంది. ప్రజల యథాతథ భావాలను చెప్పడం.

జగతి వారికి వారి జాతులింపు 1-1-178

తమలో నెవ్వరయినా తమజాతి

తమనేర్పు లెక్కుడై తోచు తక్కువనరు 8-282

కులమెంత కలిగినా కూడించు గర్వంబు 9-83

ఇక రెండవది జాత్యభిమానుల కళ్ళు తెరిపించడం

జాతియిందేదీ అంత్యజాతి యిందేది

జాతు లన్నిట ఆత్మ సర్వేశుడు

తెలివిగలదాకా తెగని మడుగులివి

అలసి నంటట మీద తడు సంశయము 5-136

జాతి చండాలము తీరు జన్మాంతరములను
ఏతుల కర్మచండాల మెన్నడూ పోదు 8_130
వట్టి నటరాజసాలు వర్ణాశ్రమములును 10_235

కులాలు, జాతులు మానవులు కల్పించుకొన్నవే అనడాన్ని నిరూపించడానికోసమో అన్నట్టు కుల ప్రసక్తి ఉన్న కీర్తనలెన్నో వ్రాశాడు. వాస్తవానికి కులం మరుగులో ఉన్న పరబ్రహ్మను కీర్తించాడు.

బావడు - ఎవ్వారు ఎరుగని ఎముకల గూటిలో
పవ్వళింపుచున్న బ్రాహ్మడు
ఎంత బావనా పోదమింత కలదా
అంతయు నీ మహిమే హరిభట్లు 4_90

రెడ్డి - తిమ్మిరెడ్డి మాకు నిచ్చె దిష్టమైన పొలము
బొమ్మిరెడ్డికప్పగించి పోదిసేసె పొలము 10_57

బోయనాయడు- పొడవైన శేషగిరి బోయనాయుడు
విడువ కందరి గాచు వెడబోయనాయుడు
పొలసి మీనాల పెద్ద బోయనాయుడు
మలగి వీపున గట్టే మంకు బోయనాయుడు
పొలము రాజై తిరిగే బోయనాయుడు
వెలదు మోటున నుండే వేట బోయనాయుడు

పై చరణాలలో మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ ప్రస్తావనలూ ఉన్నాయి, బోయల ఆనాటి ఆకారాలు కనబడతాయి.

ఈ కుల వ్యవస్థను కూకటివేళ్ళతో పెకలించడానికి కోసం అన్నమయ్య లౌకికోపమానాలు చెప్పాడు. వ్యక్తి అంతరాల్ని బయట పెట్టాడు.

నీవు సర్వసముడవు
పువ్వులపై కాసీ పారి ముండ్లపై కాసీని
ఆవల వెన్నెల కమి హాని వచ్చీనా
గోవు మీద విసరి కుక్క మీద విసరీని
పావనపు గాలికిని పావమంటీనా
కులజుని ఇంట నుండి కులహీనుని ఇంట నుండీ
ఇలలో నెండకు నేమీ హాని వచ్చీనా 2-129

ప్రకృతికి లేని అంతరం పామరుల కెందుకని ప్రశ్నించాడు, అలాగా వేదాలు చదివి ఒంటబట్టించుకోక హరిభక్తి అవంతలేని వాని కంటె కులహీనుడయినా విష్ణుపాదాలు సేవించే భక్తుడు ఘనుడని చెప్పడంలో ధైర్యం ఆ "బావనయ్య" కే చెల్లు.

కులం తరువాత సంఘంలో వృత్తికి ప్రాధాన్యం ఉంది. కొన్ని వృత్తులు శ్రేష్ఠమని, మరికొన్ని కావనే భావన ఆనాటికీ ఈనాటికీ ఉంది ఈ వృత్తి ప్రాధాన్యాన్ని గుర్తించిన అన్నమయ్య ఏవీతక్కువకావనీ ఎన్నో వృత్తుల్ని సంకీర్తనలో ప్రస్తావించాడు. తాను రైతు కావడం వల్ల దేశానికి రైతన్న ముఖ్యుడు కావడం వల్ల హాలిక వృత్తికి సంబంధించిన విషయాల్ని చెబుతూ ఆధ్యాత్మిక జిజ్ఞాస కలిగించాడు.

కాపులము మేము కర్తవు నీవు
దాపు దండై మమ్ము నిట్టె దయచూడవయ్యా 9-198

రైతన్న తరువాత సమాజంలోని వ్యక్తులకు దగ్గరివాడు చేనేతగాడు. నాటికి నేటికి వీధులో చీరలమ్మే వారిని చూస్తూనే ఉన్నాం. వారి వర్ణనలలో ఆధ్యాత్మికతను చెప్పడం అన్నమయ్య ఆశయం.

వాడల వాడల వెంట వాడివో వాడివో
నీడ నుండి చీరలమ్మే నేతబేహారి
పంచభూతములనెడి పలువన్నె నూలు
చంచలపు గంజివేసి చరిసేసి
కొంచెపు కండెల నూలి గుణముల నేసి
మంచి మంచి చీరలమ్మే మారు బేహారి 5-178

పరమాత్మునికి రైతన్న వేషం, వర్తక వేషం ఈలాగా రకరకాల వేషాలు వేసి తమ వాడన్న భావం కలిగించడం అన్నమయ్యకే సరి పోతుంది.

సంఘాన్ని సునితంగా పరిశీలించిన వాడే కవి, రాజకీయవేత్త, తత్త్వవేత్త. ఆ పరిశీలన వస్తువులదీ కావచ్చు, వ్యక్తులదీ కావచ్చు వ్యక్తులలో రక్త సంబంధమూ ఉంది. కారణ బంధుత్వమూ ఉన్నది కుటుంబంలోని వ్యక్తుల చిత్త ప్రవృత్తుల్ని సంకీర్తనలలో కళ్ళకు కట్టాడు అన్నమయ్య.

కలిగిన వాడే చుట్టరికంబుల తిరుగులని 8-68
పొట్ట పొదుగు చుట్టాలు భోజన సహాయులే 2-306
అంతహితులా తనకు అన్నలును తమ్ములును
వంతు వాసికి పెనగు వారే గాక 1-179

తల్లి-ఇల్లాలు

తల్లి మీదగల భక్తి తనకే కొన్నాళ్లను
ఇల్లాలు మీద వలె నింత ఉండదు — 2-92

తల్లిదండ్రులు-బిడ్డ

కోపగించి చంక బిడ్డ కోరి తల్లడించేతేను
పై పైనే వడుగాక పాసిపొయ్యీనా
కోపక నా నేరములు కొగి నీవు వేసరితే
నీ పాదములే గతిగాక నేమానేనా — 2-400

అతి వచ్చిన బిడ్డను అపరాధి చేసి తల్లి
పోడక అన్నము పెట్టకుండ వచ్చునా — 2-455

అన్నమయ్య కాలంలో నడిమంత్రపు సిరితో పొగరెక్కిన వారె క్కువ ఉండేవారేమో! అర్హతలేని వారు అధికారంలో ఉన్నారేమో వారిని దృష్టిలో పెట్టుకొని తమలో తాము మాట్లాడుకొనే సామాన్యుల ఆలోచనా పరళిని ఎలుగెత్తి చాటారు.

పట్టు భద్రుడు కూర్చుండే బలుసింహాసనముపై
వెట్టి బంటు పెట్టేవారు పెట్టులేరారా
గట్టిగా శ్రీహరి తోడ కలగంవ దేవతల
పెట్టి కొలుచుట విందులెట్టి వగగాదా
వరిగెలేలేవాని వట్టపు రాజుగా
నితర భోగము లిచ్చి నిలిపినట్టు — 1-282
అష్టముఃలేని నాలుక నాడుదురుగాక భూమి
దొష్టవాడేమి సేసినా దోహమందేది — 10-87

దొడ్డవాడనయ్యేనని దొరల కొలిచి వారి
కష్టము నిడుపు మొక్కి అతిదీనుడై
దొడ్డతనమేది యందు దొరయాడ నున్నాడు 2-13

జీవితమన్నది అనుభవాలకూడలి. ఆ అనుభవం తనదీకావచ్చు. ఇతరులదీ కావచ్చు. ఇతరులదయినా తనదిగా చెప్పడంలో కవి రాణి స్తాడు. మధ్యతరగతి కుటుంబాలలో చాలీచాలని జీతాలతో సరిపెట్టు కొనే యజమాని అవస్థను అన్నమయ్య

వచ్చెడా లెక్కడ తెత్తూ పట్టుచీర లేడ తెత్తూ
వెచ్చ నింద్లేడ తెత్తూ వెంటవెంటను
దొడ్డ తనమేడ తెత్తూ దొడ్డు సొమ్ములేడతెత్తూ
ఎరవుల సిరుల నేనేడ తెత్తూ

పేదవారుగా కాలం గడిపినవారు దైవ కృపవల్ల ధనవంతులు కావచ్చు. వారికి అన్నీ సమకూరవచ్చు. కాని గడచిన రోజులే వారి కళ్ళ ముందు తిరుగుతుంటాయి. ఈ విషయాన్నే అన్నమయ్య

"సిరులు కల్గిన ఫలము చింత పొరలనె కాని
పొరిది సంతోషమించుక యైన లేదు 11-3-128

ఈలాంటిదే

"వెతల పొరలే ఘనవిభవము కంటే
అతి పేదరికమది సుఖము"

ఈలాగే పేదప్రజల అనుభవాల్ని ఈ క్రింది పంక్తులలో వర్ణించాడు

అప్పులేని సంసారమైన పాటేచాలు
తప్పులేని జీత మొక్కతారమైన చాలు

కంతలేని గుడిశొక్క గంపంతయిన చాలు
చింతలేని యంబలొక్క చేరడే చాలు
తిట్టులేని బతుకు ఒక్కనమైన నదె చాలు 1-114

జీవితంలో ప్రతివారూ ఎన్నో సంఘటనలు ఎదుర్కొంటున్నారు. ఎన్నో సన్నివేశాలను చూస్తుంటారు. ఆయా సన్నివేశాలలో మానవ ప్రవృత్తి బయట పడుతుంది. వాటిని చెబుతూ అన్నమయ్య ఆధ్యాత్మిక రహస్యాలను బయట పెట్టాడు.

ఒక గ్రామంలో కారణంగానో అకారణంగానో ఎవరికైనా పోలీసులు పట్టుకుపోతే గ్రామమంతా అలజడి. అప్పై పెద్దమనుష్యులు జొక్యం కలిగించుకొని "ఊరు మంచికోసం" విడిపించుకొని రావడం తెలిపిందే ఈ విషయాన్నే

చేరి తమ వూరివారి చెరవట్టుకొని పోతే
కోరి కుయివోయి తెచ్చుకొన్నట్లు
వూరక నీ కుక్షిలోన ఉన్న నన్ను నీమాయ
వీరాన చెఱపట్టెను విడిపించుకొనవే 2-5

అలాగే "రచ్చకాడ" వని పాటలు లేనివాడు అలగా జనాన్ని కూడబెట్టుకొని తన గొప్పలు చెప్పుకొంటాడు. అలాంటి వారిని దృష్టిలో పెట్టుకొని

"తన గుట్టెల్లా నెరిగిన వారల మొందట
తన యెమ్మెలు చెప్పుకొనుట రోత" 1-28

అని ఈ డించు కొన్నాడు.

"తరుణస్తావత్ తరుణీసక్తః" అన్నాడు శంకరాచార్యులవారు. స్త్రీ పురుషుల మనోభావాల్ని స్పష్టంగా ఆకళింపు చేసుకొన్నవాడు అన్నమయ్య

కాంత తలచుకొంటేను కామోద్రేకము పుట్టు
యింతలో కూడెనా యేడకేడ సూత్రము
చింతకాయ తొక్కు చూచితేనే నోరూరు
ఎంత కెంతదవ్వు ఏడకేడ సూత్రము 2-234

జంతగాని తరుణి ఏజాతైననది చాలు.

అన్నమయ్య నాటి విజయనగర రాజుల కాలంలో రాజకీయంగా ఎన్నో మార్పులు వచ్చాయి. రాజ్యం కోసం తండ్రిని, తమ్ముణ్ణి, చివరకు కన్న కొడుకుని హతం చేయడం జరిగింది. ఆనాటి వ్యక్తి ఈ ఆకృత్యాలకు హతాశుడై పోయాడు. అందువల్లనే అన్నమయ్య

"తావు తలే రాజులకు దయ కొంత రాదాయె"

అని వాపోయాడు.

ఉపదేశం చేయవలసిన మఠాధిపతులు ఉన్నదంతా మూటకట్టుకోవడం చూసి ఆనాటి సామాన్యుడు అసహ్యించుకొని వుండవచ్చు. అంచేతనే

"వన్నె చెడి యతులు ధనవంతులయిరి". అని వాపోయాడు. ఆనాటి సామాన్యుని బతుకు ఎంత దుర్భరమో ఈ క్రింది కీర్తనవల్ల స్పష్టమవుతుంది.

కడిగడి గండమై కాలము గడపేవు
కడుగ కడుగ రొంపి కలియుగమా
బడలికె వావవు వరమేదొ చూపవు
గడి చీఁకియును నీవు కలియుగా
కానిదె మెచ్చేవు కపటాలె యిచ్చేవు
కానీలే కానీలే కలియుగమా 1-118

ఉత్తమ సాహిత్యమన్నది సామాన్యుల ఆలోచనాసరళిని వ్యక్తం చేస్తూ ముందుకు నడిపిస్తుంది. సామాన్య భాషలో, సామాన్యుల కర్ధమయ్యే విషయాలనే వ్యక్తం చేస్తూ జానపద గేయ ధోరణులతో రచన సాగించిన అన్నమయ్య సామాన్యులలో అసామాన్యుడు.



# అన్నమయ్య నవ్వులు

మనసారా ఏడవడం, నోరార నవ్వడం దేవుడు మనిషికి ప్రసాదించిన వరాలు. పురాణాలలో నవ్వి చెడ్డవారెందరో వున్నారు. సామెతలలో నవ్వుకు సంబంధించి చాలా వున్నాయి. నవ్వు నాలుగు విధాల చేటు. నవ్విన నాపచేను పండుతుంది. నవ్విన వల్లేలే పట్నాలవుతాయి. సిగ్గుమాలిన వానికి నవ్వే సింగారం మొదలయినవి. తమిళంలో పొంబళై శిరిచ్చా పోచ్చు పొగయిలై విరిచాపోచ్చు-ఆడది నవ్వినా, పొగాకు విరిగినా అంతే. సిరిత్తు వాళు సిరిక్క వాళ్‌న్ దిడాదే - నవ్వుతూ బతుకూ అంతేగాని ఇతరులు నవ్వేటట్టు బతక్కు అనే సామెత లున్నాయి. ఇంకా నీతి బోధనలలో పరపురుషుని చూచి నవ్వరాదని, సభలలో నవ్వడం పనికిరాదని ఎన్నో చెబుతారు. నవరసాలలో హాస్యమొకటి. అయినా ఈ హాస్యం ఆకార వికారాలు, సన్నివేశాలు మరికొన్నిచోట్ల మాటల ద్వారా బహిర్గతం.

ఆంధ్ర వాఙ్మయంలో "తిక్కన నవ్వుల్ని" మెచ్చుకున్నవారున్నారు. అలాగే ఈ వ్యాస రచయిత నాచన సోమన నవ్వుల్ని ఆంధ్రప్రభ 16-3-1975 తేదీ పత్రికలో వివరించారు. అయితే అన్నమయ్య సాహిత్యంలోతు చూశాక తిక్కన సోమనల కంటె అన్నమయ్య అనేకరకాలయిన నవ్వుల్ని కీర్తనల్లో పొందుపరచడం గుర్తించాను. అన్నమయ్య నవ్వుల్ని పరిచయం చేయడం ఈ వ్యాసంలోని ప్రధానాంశం. స్థలాభావం వల్ల కేవలం మూడు సంపుటాలలోని నవ్వులే ఇక్కడ చెప్పడం జరిగింది.

అన్నమయ్య ఆనందంగా బతుకు ఈదినవాడు. ఇబ్బందులు పెట్టని భార్యలు, తండ్రికి మెచ్చు తెచ్చి పెట్టని కొడుకులు, ఉన్నంతలో

హాయిగా జీవించగలిగిన స్థైర్యం అన్నమయ్యకుండడం వల్ల హాయిగా నవ్వగలిగాడు. తన చుట్టూ వున్నవారి నవ్వుల్ని చూసి విని తానూ పరవశించాడు. అన్నమయ్య నవ్వుల్లో కొన్ని సామాన్య ధర్మాలున్నాయి. ఎప్పుడు నవ్వాలి? నవ్వులు ఏ భావాన్ని వ్యక్తం చేస్తాయి. అనడాన్ని అన్నమయ్య కొన్ని చోట్ల వాచ్యం కూడా చేశాడు.

చొప్పెరిగి నవ్వు టొప్పు
చిలుకు మదములకు చిరునవ్వులే సిరి
హృదయాలకు నవ్వులే ఎచ్చరిక
ముసి ముసి నవ్వులు ముచ్చటలకు మూలము
నవ్వులు నవ్వేటివేళ నయము చూపగవలె
అయములు సోకని నవ్వులవి ఎంత నవ్వినాను
కాయకములే కాని కళ దాకదు
నవ్వు నవ్వు నవ్వు నాటు ప్రియము
వినయముతో చెప్పిన విందు కడుగడు చవి
ననుపుతో నవ్విన నవ్వు చవి
వంచుకొంటే నవ్వులు వరద వారు
చిలుకు మదములకు చిరునవ్వులె సరి

ఇంతేకాదు అన్నమయ్యకు ఆడవారి నవ్వులు, నవ్వులలో తేడాలు కూడా తెలుసు. ఒకచోట

నవ్వితేనే చాలదా నాతుల మనసులకు
అవ్వల పంచబాణములై నాటును

అని మగవారి నవ్వులలోని పారవశ్యశక్తిని చెప్పాడు.

అలాగే మరోచోట.

చే మంచి నవ్వకురే సిగ్గుపడీ నాతడు

అని ఆడవారి నవ్వులకే సిగ్గుపడే కొందరి మగవారి ప్రవృత్తిని కళ్ళకు కట్టించాడు.

పెద్దవాళ్ళమని అనుకొనే వారినోట ఎపుడయినా అప్రయత్నంగా బూతుమాటలు వస్తే నవ్వుకోవడం అలవాటు. "సంతపాక లంజతెచ్చి" "లంపునొల్లెతల లంజకాడ" యేదిరింటి లంజె వోయి మేదినీశు తగులంగ"- లాంటివి వింటుంటే కలిగే అనుభూతి అలాంటిదే.

అన్నమయ్య నవ్వుల్లో సవ్వడిని గుర్తించినవాడు. నవ్వుల్లో కొలతలను చూచినవాడు. నవ్వుల్లో అంగిక చలనాన్ని, రంగునుకూడా చూశాడంటే ఆశ్చర్యం వేస్తుంది.

కొందరి నవ్వులు గుట్టుగా వుంటాయి. కొందరి నవ్వుల్ని తెర వేసినా గుర్తించవచ్చు. కొందరి నవ్వుల్లో ఎంతో ఆర్భాటం అట్ట హాసం చూడవచ్చు. ఏమయినా ఇవన్నీ సవ్వడి నవ్వులే. అన్నమయ్య సవ్వడి నవ్వుల్లో కలకల నగవు, పకపక నవ్వు, సందడి నవ్వు, వెకిలి నవ్వు, పక్కన నవ్వు, కడు నవ్వు, వికవిక నవ్వు మొదలయినవి చెప్పుకోవచ్చు.

కలకల నగవులు :

కలకల నగవులు కొతాళపు తగవులు.

సందడి నవ్వు :

సందడి నవ్వు నవ్వేవు సారె సారెకు

వెకిలి నవ్వు :

వెకిలి నవ్వులచె వెన్నెలు కాసె

పక్కున నవ్వు :

పక్కున నవ్వగానే పైకొని పంతమాడేవు

పకపక నవ్వు :

పంతము నీవాడగాను పకపక నవ్వువచ్చె అశక్తులయినవారు పంతమాడితే ఎదుటి వారికి వచ్చే నవ్వు పకపక నవ్వు

చిక చిక :

చిక చిక నవ్వకురా నలుగడ

కడు నవ్వు :

కనుపట్టెనా నీకు నేడు నవ్వు వచ్చేనా

లోకంలో మనం ఎవరయినా నవ్వితే ఏం కనబడిందని నవ్వు తావురా అని ప్రశ్నించడం ఇక్కడ గుర్తుంచుకోవాలి.

సన్న నవ్వులు :

సందడి నవ్వుల్ని గుర్తించడం, వారి మనోభావాలను పసిగట్టడం తేలికగాని సన్న నవ్వుల వ్యవహారం తెల్సుకోవడం చాలా కష్టం. అన్నమయ్య సన్న నవ్వుల్లోను ముసిముసి నవ్వు, చిరు నవ్వు, గుట్టు నవ్వు, పలచని నవ్వు, సన్నల నవ్వులున్నాయి.

ముసి ముసి నవ్వు :

నానబట్టి ముసిముసి నవ్వులు నవ్వీనాపె

చిరు నవ్వు :

చెలరేగి చెలరేగి చిరునవ్వులు నేవ్వేవు

గుట్టున నవ్వు:

రట్టు సేసి యిదిగాక గుట్టున నవ్వేనంటే దిట్ట.

వలచని నవ్వు:

చలువైన నెమ్మోము చందురు వెన్నెలేకాదా
వలచని నవ్వులై వచ్చు దీరీని
వలచని నవ్వులు వయ్యెద కవ్వము
చెలియ నీకైతే సింగారము

సన్నల నవ్వు.

మన్నింతువంటా నీతో మనవి విన్నవించితే
సన్నల నవ్వేవు నీవు సారె సారెకు

కొలతల నవ్వులు:

తూకాలు, కొలతలు ఎన్నోరకాలు. అలాగే అన్నమయ్య నవ్వుల్లో కూడా కొలతల నవ్వులున్నాయి. వాటిలో కొంతనవ్వు, కువ్వనవ్వు, ఇంతేసి నవ్వు, వెలలేని నవ్వు, చిక్కని నవ్వు మొదలయినవి చెప్పుకో వచ్చు.

కొంత నవ్వు:

గుట్టున శ్రీవేంకటేశ కొంత నవ్వే చాలదా

కువ్వ నవ్వు:

తవ్వక చూచితేను తరి తీపు లెల్లారేగు
కువ్వవడ నవ్వగాను కొవ్వు వీడును

చిక్కని నవ్వు:

చిక్కగ నవ్వితే నేల సిగ్గువడేవు

కోటిసేయు నవ్వు :

కోటిసేయు నవ్వు నవ్వి

కదలిక నవ్వులు

ఏలాంటి కదలిక లేకుండా భావప్రదర్శన చేయడం సాధ్యం కాదు. మరి హాస్య ప్రదర్శనలో కదలికలు అనివార్యం. అయితే ఆ కదలికలలోను సౌకుమార్యం కొందరిలో కనిపిస్తుంది.

కులుకు నవ్వు :

కులుకు నవ్వులతోడ కొప్పువీడ

కన్నుల నవ్వు :

తలయెత్తితే నన్ను తప్పక చూచితేను

మెలపు కన్నుల నవ్వి మీర నటిచే

ఒడి పట్టుకుని నవ్వు :

వొద్దిక సేవలు సేసి వొడి పట్టుకొని నవ్వు

ముసిముసి నవ్వు :

ముక్కర కదలగాను ముసి ముసి నవ్వు నవ్వి

నానా రకాల భావాలు నవ్వుల్లో తొంగి చూస్తాయి. కొన్ని మరిపిస్తాయి కొన్ని మెరపిస్తాయి. కొన్ని తలపిస్తాయి. మరికొన్ని తలపోతలో నిలుస్తాయి.

కోపం కినుక నవ్వు

మన పెరిగుండియును మగని నింత సేతురా

కినుక నవ్వు సేయక కేలెత్తి మొక్కవే

కౌంతం :

కొంత కొటుకల కనుచూపులకును
కౌంతపు నవ్వులు సరిసరియే

తనివోని నవ్వు :

తనివోని నవ్వులు తాపము లవును

వింత :

వీడి వీడని వింత నవ్వులు

ప్రతిస్పందన :

నవ్వి మారు నవ్వరాదా నలినాక్షి
మారుకు మారు నవ్వులు

ఇచ్చకపు నవ్వు :

అలన నవ్వులలోనే అక్షలైన యిచ్చకాలు
హృదయాలకు నవ్వులే హెచ్చరిక

వేడుక నవ్వు :

విరి వాసన వంటిది వేడుక నవ్వు

నగరాని నవ్వు :

నగరాని నవ్వు నీతో నవ్వినలమేల్మంగ

ఇవే కాకుండా గరువపు నవ్వు, మాయల నవ్వు, చనవుల నవ్వు, చిడిముడి నవ్వు, సిగ్గుల నవ్వు, నయాన నవ్వు, దప్పితో నవ్వు మొద లయినవి చెప్పుకోదగ్గవి.

అన్నమయ్య నవ్వుల్లో "పోలికల నవ్వులు" ప్రత్యేకంగా పరిశీలించతగ్గవి. వాటిలో మొలక నవ్వు, వీషపు నవ్వు, తీగె నవ్వు, పాల వంటి నవ్వు, తవ్వారపు నగవు, పూల నవ్వు, వెన్నెల నవ్వు, పూవ నవ్వు, చిరునవ్వు తలబాలు, ఆమని నవ్వులు చెప్పుకోదగ్గవి.

సిగ్గులకే తెరవేసి చిరునవ్వు తలబ్రాలు
"సన్నపు నడిమిదాన సళుపు చూపులదాన
వెన్నెల నవ్వులతోడి వీరిడి దాన"
కందువ నవ్వులు నవ్వి కడు పచ్చడము గప్పి
"చక్కని నవ్వుల సొనరాయివే"
అన్నమయ్య నవ్వులకు రంగులు కూడా వున్నాయి.
పడుమేల బడుగాయ నవ్వులేల తెలుపాయ తెలుపు నవ్వు.

అన్నమయ్య నవ్వుల్లో పరిహాస వాతావరణం కూడా కనిపిస్తుంది. నాయిక స్త్రీ కనుక అందంగా ఓపిగ్గా అలంకరించుకుంటుంది. నాయకుడు పురుషుడు కావడం వల్ల అందం పట్ల అంత అనురక్తి ఉండదు. ఉన్నా అలంకరణ పట్ల ఓపిక కూడా అంతంత మాత్రమే. నాయికను చేరడానికోసం తొందరగా ముస్తాబయిన నాయకుని చూసి నాయిక

"నవ్వి నట్టే వున్నది నీ నామము చూడ"

అంది. బహుశః ఇందులో నాయికా నాయకుల అన్యోన్య ప్రేమానురాగ చిహ్నాలు కూడా ఉండవచ్చు. ఆ గుర్తింపును చూసి నాయిక నవ్వుకుని వుండవచ్చు.

ఉమ్మడి కుటుంబ వాతావరణం వున్న రోజుల్లో కొత్తదంపతులు ఒకరినొకరు కలుసుకోవడానికి పడే యాతన లెన్నో. పైగా పెద్దల

కట్టడి ఇతరుల రట్టడి. నాయిక నాయకునికి అవసరం సమకూర్చే వుద్దేశ్యంతో పచ్చడం తెచ్చింది. బహుశః అది చలికాలం కావచ్చు. పచ్చడంతో సర్దుకొమ్మని చెప్పడం నాయకుని కోపానికి పరాకాష్ఠ. కాని నాయిక పచ్చడం అందిస్తూ "కందువనవ్వు" నవ్విందట. తాను వచ్చేదాకా ఈ పచ్చడమని, ఆ తరువాత తానే పచ్చడమని అర్థం వచ్చేలా నవ్విందని భావం.

"కందువ నవ్వులు నవ్వి కడు పచ్చడము గప్పి"

అన్నమయ్య సంకీర్తనలు "నవ్వులగని" అని సారాంశం.



# మహాకవి అన్నమయ్య

అన్నమయ్య ఒక మహాకవి. ఈ మాట కొందరికి చిత్రంగా అనిపించవచ్చు. అది వారి తప్పు కాదు. లోకంలోని వ్యక్తుల్ని కొందరిని కొన్ని కోణాలలో పరిశీలించి పేర్లు పెడతారు. ఆ పేర్లు ఆనోట ఈనోట ప్రాకి చివరికి రూఢి అయిపోతుంది. ఉదాహరణానికి ఎన్నో స్వతంత్ర రచనలు చేసినా తిరుపతి వేంకట కవులకు "అవధాను లనే" పేరు స్థిరపడ్డట్టు. అలాగే అన్నమయ్యకు పదకవితా పితామహు డని, సంకీర్తనాచార్యుడని వాగ్గేయకారుడని రకరకాల బిరుదాలు. ఈలాంటి పేర్లు రావడానికి ప్రదానంగా రెండు కారణాలు కనిస్తాయి. మొదటిది సమకాలంలో ఎవరూ చేపట్టని ప్రక్రియ చేబట్టడం. రెండవది తన భావ సంపదన, వైదుష్యాన్ని ప్రకటించుకోడానికి ఎన్నుకొన్న వాహిక కారణం కావడం

అసలు అన్నమయ్య కీర్తనలే ఎందుకు వ్రాశాడన్నది కుతూహలమయిన ప్రశ్న. దీనికి ప్రధానంగా మూడు కారణాలు చెప్ప వచ్చు. విశాఖా నక్షత్ర జాతకులు స్థూలంగా విలక్షణ పంథాన్ని తొక్కడానికి ఇష్టపడతారు రెండవది తమిళంలోని నాలాయిరదివ్య ప్రబంధంలాగా అప్పుడప్పుడే కర్నాటకంలో పండితుల్ని పామరుల్ని ఆకట్టుకొంటున్న హరిదాస సాహిత్య సంప్రదాయం. ఇక మూడవది పదాలలో కూడ పరమోత్తమ కవిత్వం ప్రకటించవచ్చు అనేసత్యాన్ని నిరూపించ దలచుకోవడం.

కవి అనే మాటకు పరమాత్మ, ఋషి, వర్ణన చేసేవాడు అని అర్థాలున్నాయి అదిగాక ధీరుడు, ప్రాజ్ఞుడు, ప్రసిద్ధుడు, ప్రకృతిక భాష్య ప్రణీత కవి. అన్ని రాళ్లు వజ్రాలు కానట్టే కలం పట్టిన ప్రతి

వాడూ కవికాడు మహాకవులనేవారు వేళ్లలో లెక్కపెట్ట వలసినవారని అన్నాడు. ధ్వన్యాలోకకర్త. మహాకవి లక్షణాలనేవి చాలావున్నా వీటిలో ఐదింటిని మాత్రం పరిశీలిద్దాం. మొదటిది వైదుష్యం. కవులు మూడు రకాల వారని, వారు శాస్త్రకవి, కావ్యకవి, ఉభయకవి అని. అన్నమయ్య ఉభయకవి

విద్య అంటే ప్రాచీన కాలంలో బ్రహ్మవిద్య మాత్రమే ఆధ్యాత్మిక ప్రపంచంలో అడుగు పెట్టిన వ్యక్తికి వేద, పురాణ, ఉపనిషత్, గీతేతిహాసాల పరిజ్ఞానం తప్పని సరి. అవసరమయినపుడు, ఊకదంపుడుగా కాకుండా ఆయా గ్రంథాలలోని వాక్యాలను యథాతథంగా ఉదహరించడం లేదా వాటి అర్థాన్ని తన మాటల్లో చెప్పడం వైదుష్యంలో ఒక భాగం.

ఉదాహరణానికి . అనాయుధాసో అసురా అదేవాయుని
విసోదము గ ఋగ్వేదము తెలిపెడి
సనాతనము విష్ణుచక్రధారణకును
అనాది ప్రయోజమంటే తెలియరో

ఇలాగే విష్ణ్వాధిక్యాన్ని నిరూపించడానికి భారత, భాగవత, విష్ణు పురాణాదుల్ని పేర్కొనడం.

మహాకవి అని నిరూపించడానికి రెండవ కొలబద్ద భావుకత వెన్నక్క వైదుష్యం. కవి ఆశించే ప్రయోజనం, కవి అభిమతం అన్నీ అక్కడక్కడ తొంగి చూస్తాయి. అన్నమయ్య వర్ణనలు పామరుల్ని తలవూపిస్తాయి.

ఉదా.

నీ రాటలోన తన నీడ చూచి బాలుండట
రారమ్మని పిలిచి రాపుండగా
కారించి కడవ నీరు కలంచి చేత వెదకి
పూరకే కానక పొంచి వున్నాడు కృష్ణుడు.

అల్లరి కృష్ణునితో ఆడుకోవడానికి ఎవరూ రాలేదేమో, అక్క
తచ్చాడుతున్నాడు. కడవలో చూశాడు ప్రతిబింబం కనిపి
నీళ్లలో దాక్కున్నాడేమో అని పిలిచాడు.

రాలేదు. చేతులు ముంచి వెదకాడు. బహుశః కడవ వగి
లేదా నీళ్లు ఒలికిందేమో, లేదా ఈలోగా 'ఎవర్రా అక్కడ"
వేశారేమో, కృష్ణుడు దాక్కొన్నాడట. వీటిని స్వభావ వర్ణన అ
వచ్చు. ప్రతి యింట ప్రతిచోట చూసే దృశ్యాలివి.

స్వభావ వర్ణనలతో బాటు పౌరాణిక సత్యాన్ని జో
మరో తెగ.

ఏమి సేయవచ్చు కర్మము ఇచ్చినంతే కాని లేదు
తాము సేసినంత పట్టు తమకు పోరాదు
ఇట్టునట్టు మిట్టిపడ్డ యించు కంతా చోటులేదు వీపు
బట్ట గట్టు మోపు మోచి పాటు పడ్డా లేదు
తట్టు వడ్డా లోక మెల్లా తవ్వుకొన్నా లేదు
తెట్ట తెరువున నోరు తెరచినా లేదు.

పై చరణాలలో "బతుకు పాట్లు'' కనిపిస్తాయి. నిలకడలే
కష్టపడ్డా తీరని కష్టాలు. అన్నీ వున్నాయి. సూక్ష్మంగా

"దశావతారాలు" కనిపిస్తాయి. పై చరణాలలో మత్స్య, కూర్మ, వరాహ నారసింహావతారాలు స్ఫురిస్తాయి.

వర్ణనల్లో రామణీయకాన్ని ప్రదర్శించడంకూడా మహాకవిత్వంలో విధానమే మరి. "కామాతురాణాం న భయం న లజ్జా" అన్నారు పెద్దలు. ఈ సత్యాన్ని దేవునికికూడా చక్కగా జతవేశాడు అన్నమయ్య.

తలపు కామాతురత్వము మీద నలవడిన
నిల వెట్టి వారైన నేలాగు గారు
ఓలి నిరువురు సతుల నాలింగనము సేయు
లోలు డటుగాన నాలుగు చేతులాయ
వేల సంఖ్యల సతుల వేడుకల రమియింప
బాటు వడె గాన రూపములు పెక్కాయ

ఒకరిని కావలించుకొన్న చేతులతో తన్ను కావలించుకోవడాన్ని భూదేవి, శ్రీదేవులు ఇష్టపడలేదేమో లేదా సబబు గాదంటూ నాలుగు చేతుల వాడయ్యాడని అన్నమయ్య హాస్యస్ఫూర్తి కలిగించాడు. అలాగే అనేక అవతారాలెత్తడానికి కూడా కారణాలను ఏకరువు పెట్టాడు.

అన్నమయ్య వర్ణనల్లో వైవిధ్యముంది. వైవాహిక వర్ణనలో అన్నమయ్య అమ్మాయి పక్షం వహించి సమర్థించడం ఒక రకం.

ఈకెకు నీకు దగు నీడు జోడులు
వాకుచ్చి మిమ్ము పొగడ వసమా యొరులకు
జట్టిగొన్న నీ దేవులు చంద్రముఖి కనుక
అట్టి నిన్ను రామచంద్రుడన దగును.
చుట్టమై కృష్ణవర్ణపు చూపుల యాపె గనుక

చుట్టుకొని నిన్ను కృష్ణుడనగ దగును
చందమైన నామలోచన యాపె యౌగనుక
అందరు నిన్ను వామనుడన దగును
చెంది యాకె యప్పటిని సింహమధ్యగనుక
అంది నిన్ను నరసింహుడని పిల్వదగును
చెలువమైన యాపె శ్రీదేవి యగు గనుక
అల శ్రీ దక్షుడవని యాడ దగును. 30-552

వరునికి ఏ సౌభాగ్య భాగ్యాలు కలిగినా వధువు పక్షం వారు తమ అమ్మాయివల్ల అదృష్టం పట్టిందను కోవడం తెలిసిందే. దశరధుని కుమారుడు రాముడు. కాని చంద్రముఖి లాంటి సీతను పెళ్ళాడడం వల్ల "రామచంద్ర" నామం సార్థకం. ఆమె నామలోచన కావడం వల్ల వామనుడనే పేరు సార్థకం. వామనరూపం కూడా సులభ సుందరమని మనోహరమని ప్రసిద్ధి.

వైదుష్యాన్ని వర్ణనలకు వాడుకోవడం మహా కవిత్వ లక్షణం. ఆ వైదుష్యం పండితామోదానికే గాక పామర సమ్మోదానికి కూడా దోహదం చేయడం అన్నమయ్య ప్రత్యేకత. అమ్మవారిని నవరస స్వరూపిణిగా వర్ణించడం రూలాంటిదే.

నవరసములదీ నళినాక్షి
జవకట్టి నీకు జవి సేసీని
శృంగార రసము చెలియ మొకంబున
సంగతి వీరరసము గోళ్ల
తంగగు కరుణారసము పెదవులను
అంశపు కుచముల అద్భుత రసము

చెలిహాస్యరసము సెలవుల నిండీ
వలచని నడుమున భయరసము
కలికివాడు కన్నుల భీభత్సము
అల బొను జంకెనలదె రౌద్రంబు
ఇరవుగ శ్రీవేంకటేశ కూడితివి
సతమై యీపెకు సంతోషరసము    13-282

ఈ కీర్తనను అభినయించినపుడే చక్కటి స్ఫూర్తి కలిగే అవకాశముంది. అలాగే అమ్మవారిని అన్ని రాశులతో పోల్చడం కూడా గమనించ దగ్గది.

ఇన్ని రాసుల యునికి ఇంతి చెలువపు రాశి
కన్నె నీరాశి కూటమి కలిగిన రాశి

వర్ణనల్లో జానపద మనస్తత్వాన్ని, భాషలలోని జాతీయాన్ని వాడుకోవటం ఒక ప్రత్యేకత. రంగనాథ రామాయణంలో, మొల్ల రామాయణంలోనూ ఈలాంటి సన్నివేశాలు కొన్ని కనిపిస్తాయి.

చందమామ పాడి తల్లి సరిపొత్తుకు రమ్మంటే
చందురు చూచి కృష్ణుడు సన్న జేసెను
ముందర చంద్రుడు వచ్చి మొక్కితే యశోద చూచి
ముందెలా యంటినో యని మరచి వెరగందెను.    10-285

అధికారి ఆదేశమిస్తే సేవకుడు పాటించడం అనవాయితి. అందువేత కృష్ణుడు సైగచేస్తే చంద్రుడు దిగి రావడంలో తప్పేమీలేదు. ఈనాటకమంతా తెలియని యశోద దిగ్భ్రమ చెందడంలో ఆశ్చర్యం సుతరామూ లేదు.

జానపదుల వ్యవహారంలో "పొడుపుకథ"కు ప్రాధాన్యమెక్కువ. అన్నమయ్య కీర నల్లోని పొడుపు కథ.

అంత సిగ్గుపడకువే అతివనీవు
వంతమున తెలియక పాయమెల్ల గడువ
నొంది నొక్క సింహమట కొండలు మోచినదట
ఇందుముఖుల నడుమె యిరవట
కలదువ యీ పొడుపు కత యిది నీవు నాకు
అందముగ నానతీవే అరుసెల్ల గడువు

అమ్మాయి నడుమును స్తన సంపదను ఎంతో చక్కగా అన్నమయ్య వర్ణించాడు. ఇదే కాకుండా తుమ్మెద పదాలు, దోబూచి, అల్లోనేరేళ్లు, విన్నపాలు, కోలాటాలు, చాంగు భళాలు ఎన్నో కనిపిస్తాయి.

మహాకవి ముఖ్యగుణాలలో ధైర్యమన్నది ఒక్కటి. కవులందరు ధీరులు కారు. ధైర్యము హృదయానికి సంబంధించిన అంశం. ఆంధ్ర వాఙ్మయంలో పోతన, ధూర్జటి, పదకవులు మూర్తీభవించిన ధైర్య పురుషులు. ఈ ధైర్యం స్వవిషయంలో కావచ్చు. లేదా లోకుల్ని పెడదారి పడనివ్వకుండా కాపాడడానికి కావచ్చు.

నరహరి కీర్తన నీనిన జిహ్వ
పరుల నుతింపగ నోపదు జిహ్వ అనడం, అలాగే
ఆకటివేళల నలపైన వేళలను
తేకువ హరినామమే దిక్కు మరిలేదు అనడం ఇలాంటిదే.
దొడ్డవాడనయ్యేనని దొరల గొలిచి వారి

కడ్డము నిడుపు మొక్కు అతిదీనుడై
దొడ్డతనమేది యందు దొరయాడ మన్నాడు
వొడ్డి హరి గొలువక వోడువడె జీవుడు

రాజు కర్మాగారం రాజ్యం. కవికృతి కావ్యం. రాజు ఔన్నత్యం రాజు కెంత గర్వకారణమో ఉత్తమ కావ్యసృష్టి కవికంత సంతృప్తి నిస్తుంది. కావ్య ప్రయోజనాలలో "విశ్వశ్రేయస్సు" చాల ముఖ్య మయింది. ఈ శ్రేయస్సు కోసం మహాకవి లోకజ్ఞుడు కావాలి. ప్రబంధ కవులు చూసిన లోకం పరిమితమయిన రాజాంతఃపురవాసం. వారి పరిధి స్వల్పం. ప్రజాకవులది పరిధిలేని సామ్రాజ్యం. వారి రచనలకు శ్రోతలు సామాన్య ప్రజలు. అంచేత ప్రజల ఆలోచనలు పదాలలో ప్రతిధ్వనిస్తాయి.

పతిలేని భూమికి బలవంతుడే రాజు
గతిలేని కూటికి కన్నదే కూడు
సతి లేనివానికి జరిగినదే యాలు
కుత దీరుటకు రచ్చకొట్టమే యిల్లు

సందేశం మహాకవి పరమ లక్ష్యం. అన్నమయ్యలో ఎన్నో సందేశాలు కనిపిస్తాయి. అన్నిటికన్న భగవంతుని సేవించి తరించ మనడం గొప్ప సందేశం.

"ఏమి వలసిన నిచ్చు నెవ్వడైనను
ఏమరక కొలిచిన నీతడే దైవము
ఘనముగా నిందరికి కన్ను లిచ్చు కాళ్ళిచ్చు
పనిసేయ చేతులిచ్చు బలియుడై

పంతమాడి కొలిచిన ప్రాణమిచ్చు ప్రియమిచ్చు
ఎంతటి పదవులైన నిచ్చె యిచ్చు”

అన్నది అతని భరోసా, ఈ కారణం వల్లనే “తందనాన ఆహి తందనాన” పాటలో సర్వ మానవ సౌభ్రాతృత్వాన్ని చాటాడు.

జీవితం సుఖమయం కావాలంటే సంతృప్తి అవసరం.

“కంతలేని గుడిశ ఒక్క గంపంతయిన చాలు
చింతలేని యంబలి ఒక్క చేరడే చాలు
జంత గాని తరుణి ఎఙాత్తైన పదె చాలు
వింతలేని సంపద ఒక్క వీసమే చాలు

పదాలలో పరమార్థం బోధిస్తూ రచనల్లో మహా కవిత్వ లక్షణా లను ప్రదర్శించిన మాననీయుడు అన్నమయ్య.



# అన్నమయ్య పదకవితా సౌందర్యం

నేటి జన జీవితంలో బస్తీలకున్న విలువ పల్లెటూళ్ళకు లేదు. అలాగే ప్రాచీన కాలంలో శిష్టసాహిత్యానికున్నంత ఆదరణ, గౌరవం పదసాహిత్యానికి లేదు. పైగా పదకవితలు ముది విటులు అని మూతి విరుపు కూడా. వెయ్యేళ్ళ చరిత్ర వున్న ఆంధ్ర వాఙ్మయంలో పండిత కవులున్నారు. కవి పండితులున్నారు. లాక్షణిక కవులున్నారు జాన పద కవులున్నారు. అలాగే ఎందరో కవులున్నారు. అయితే పదకవుల్ని పట్టించుకున్న వారుగాని, పద కవితా సౌందర్యాన్ని మనసారా మెచ్చుతున్న వారుగాని వేళ్ళమీద లెక్క పెట్టవచ్చు. అంత మాత్రాన వారు కవులు కారని కాదు, వారి రచనల్లో సంగీత ధర్మం ప్రధానమై సాహిత్యం ప్రధానమయి పోయింది. అయితే అన్నమయ్య వంటి వాగ్గేయకారుల రచనల్లో మాత్రం కవిత్వం, సంగీతం, నృత్యం త్రివేణీ సంగమంలా కలసిపోయింది.

తాళ్ళపాక అన్నమయ్య ఛొత్తపినాడులోని కడప మండలం తాళ్ళపాక గ్రామవాస్తవ్యుడు. క్రి.శ. 1408లో జన్మించి క్రి శ. 1503 దాకా జీవించిన ఆయుష్మంతుడు. వేదాల నధ్యయనం చేసినవాడ యినా, శాస్త్రాలను చదివిన వాడయినా ప్రాచీన సాహిత్యాన్ని తరచి చూసిన వాడయినా తాళ్ళపాక అన్నమయ్య శిష్ట సాహిత్య పంథాను వదలిపెట్టి ప్రజా సంక్షేమం పరమార్థంగా పామర జనోద్ధరణ పరమ కర్తవ్యంగా తానమ్ముకున్న సిద్ధాంతాల ప్రచారం స్వధర్మంగా భావించి పరిశ్రమించి పదసంకీర్తనా యజ్ఞం జీవితాంతం సాగిం చాడు. అందువల్లనే అన్నమయ్య పదకవితల్ని పరకవిత్వ వాణీ వీణా వాదంబులుగా సుజనాహ్లాదంబులుగా భావింతారు.

కవితకు భావుకత ప్రాణం లాంటిది. ఈ భావుకతలో [illegible]దు ష్యం ఉంది. వైవిధ్యం వుంది. పండిన అనుభవ వ్యక్తీకరణ వుంది. అన్నిటికీ మించి మనసును మురిపించి మరపించే తత్త్వం వుంది. ఈ [illegible] కారణంగా కవితాజగత్తులో సుందరంకానిది ఏదీలేదు అరూపం లేదు. [illegible] లేదు. అంతా ఆనందం పంచుకోవడానికి ఆహ్వానించే మార్గాలే ఈ మార్గాల్లో శబ్దానికి ఒకప్పుడు పై చేయి. మరొకప్పుడు అర్థానికి [illegible]. ఇంకొకప్పుడు శబ్దార్థాలను దాటిన వ్యంగ్యానికి [illegible] అన్నమయ్య సంకీర్తనల్లో వాచ్యసౌందర్యముంది వ్యంగ్య చమత్కారముంది అన్నిటికి మించిన ధ్వని సౌందర్యముంది.

విషయం ఒక్కటయినా విభిన్న మార్గాలలో చెప్పడం అన్న మయ్య కవితలోని ప్రత్యేకత. శ్రీనివాసుని వర్ణనల్లో, దశావతార సంకీర్తనల్లో ఈ చమత్కారాన్ని గుర్తించవచ్చు. కనుకనే శ్రీవేంక టే[illegible] 'పెద్ద భూతంగా' వర్ణించాడు. అంటుకున్న మేనిఛాయ "[illegible] పండుగా" అభివర్ణించారు. "పొడవైన శేషగిరి బోయ [illegible]'గా దర్శించాడు వాడవాడల చీరలమ్మే బేహారిగా గుర్తించాడు.

ఏ [illegible]త్రం పొసగని లౌకిక అలౌకికాంశాలను ఒకచోట జత చేయడం అన్నమయ్య ప్రత్యేకత.

సామాన్య మానవుని జీవన భారాన్ని తలపిస్తూ

"ఏమి సేయవచ్చు కర్మ మిచ్చినంతనే కాని లేదు
తాము సేసినంత వట్టు తమకు పోరాదు

ఇట్టునట్టు మిట్టిపడ్డా యించుకంతా లేదు నీవు
బట్టగట్టి మోపు మోచి పాటుపడాలేదు" అని కీర్తించాడు.

అలాగే తప్పుచేసినవాడు తన వారిముందు నిలబడ్డప్పుడు పడే అవస్థను జతచేస్తూ

"తగిలి తప్పక చూచు తలవంచు నంతలోనే
నిగిడి చింతారతి నేలదవ్వును
ఏమమ్మ మగువా నీ వింత సేతురా"

అనే పదాలతో మత్స్య, కూర్మ, వరాహాది అవతారాలను కూడా వర్ణించాడు

ఒకే వస్తువును శృంగారపరంగా, అధ్యాత్మపరంగా కూడా అన్వయించి చెప్పడం మరో ప్రత్యేకత. అవాహనం, ఆసనం, అర్ఘ్యం, పాద్యం మొదలయినవి షోడశోపచారాలు. పూజావిధానంలో భక్తుడు ప్రీతితో సమర్పించే కైంకర్య విధానాలు. వీటిన ఏకరువు పెట్టడంలో వింత లేదుగాని

"అంగన నిన్ను చూచుటే ఆవాహనము. ఆకెకు
అంగవించి నీవు మతి హత్తినదే ఆసనము
సంగతి నీపై చింతే సదా ధ్యానము సుమ్మీ"

అని నాయికాపరంగా చెప్పడం ప్రత్యేకత. ఈలాగే "వేదములే గుఱ్ఱములు విష్ణుని రథమునకు" అని సంప్రదాయంగా చెబుతూ

తరుణి దేహమే నీకు తగు దివ్యరథము
గరుడ ధ్వజం బాపె కప్పువయ్యెద"

అని సమస్తం అన్వయిస్తూ చెప్పాడు.

అన్నమయ్య "మడిగట్టుకున్న" లాక్షణిక కవి కాదు. అష్టా దశాది పురాణ కథలపై అతనికెంత మక్కువో అలాగే జానపద కథాం శాల మీద కూడా వుంది. వాటిని ప్రామాణికాలుగా భావించాడు. పద సాహిత్యంలో శాశ్వతం చేశాడు. రాముడు పసితనంలో అన్నం తిన డానికి మారాం చేసినట్టు, చంద్రుని పట్టితెచ్చి యిమ్మనికోరినట్టు, చివ రకు అద్దంలో చంద్రుని చూపితే ఏడుపు మానినట్టు కథ. అయితే కృష్ణునికి చంద్రునికి సంబంధం కలుపుతూ అన్నమయ్య పాడినపదం అతిలోకరమ్యం.

చందమామ పాడి తల్లి సరిపొత్తుకు రమ్మంటే
చందురు చూచి కృష్ణుడు సన్న చేసెను
యిందర చంద్రుడు వచ్చి మొక్కితే యశోద చూసి
ఇందేలా యింటికో యని మరచి వెరగందెను

తల్లి "చందమామ" పాట పాడింది. కృష్ణుడు కొంటెతనం కోసం "సైగ" చేశాడు. అధికారి సైగచేస్తే సేవకుడు వచ్చినట్టు ఆకాశంలోని చంద్రుడు అట్టే దిగి వచ్చాడు. చంద్రుని చూడడంతో తల్లి దిగాలు పడిందట.

చమత్కారం కోసం అన్నమయ్య పదాలలో విసిరిన విసురులు చెణుకులు కోకొల్లలు. అందరికి రెండు చేతులుంటే స్వామికి నాలుగు చేతులెందుకని సందేహం రావడం సహజం. దానికి సమాధానంగా

"ఒలి నిర్వ్వర సతుల నాలింగనము సేయ
లోలుడటుగాన నాలుగు చేతులాయ"

అనడం అన్నమయ్యకే చెల్లు. బండి తొక్కిన పాపం వల్ల కృష్ణుడు బండిబోయడయ్యాడట. అందగాడయిన స్వామి విరహం

కారణంగా నల్లబడ్డాడట. అమ్మవారి విషయంలో కూడా అన్నమయ్య వెనకడుగు వేయలేదు. నడుమును లేనట్లుగా వర్ణించడం, నవ్వుల్ని తెల్లగా చెప్పడం. కురుల్ని చీకటిగా చెప్పడం కవి సమయాలయితే వాటికి కారణాలు చెప్పాడు అన్నమయ్య.

నడుమేల బడుగాయ నవ్వేల తెలుపాయ
వెడగు నీ గుణములు విని విని పో
కురులేల చీకటాయ గోళ్ళేల వాండ్లాయ
పొరిది నీచేతలనే చూచిచూచి పో

పొడుపు కథల పద్ధతిలో అమ్మవారి అవయవ సౌందర్యాన్ని అభివర్ణించడం మరో పద్ధతి.

గొంది నొక్క సింహమట కొండలు మోచినదట
ఇందు ముఖుల వశము యిరవట
కందువ ఈ పొడుపు కత యిది నీవు మాకు
అందముగ ఆనతీవే ఆరునెలల గడువు

అనడంలో సింహ మధ్యమ, గిరికుచ, పరిచారికా సమేత అని స్పష్టం.

వర్ణించడంలో నేర్పున్నవాడే కవి. ప్రతిభావంతుడు వస్తువుల్ని నిశితంగా పరిశీలించగలడు. ఆయా వస్తువుల లేదా వ్యక్తుల చలత్సౌందర్యాన్ని, అచలత్సౌందర్యాన్ని కళ్ళకు కట్టించగలడు. అన్నమయ్య అలాంటి మహాకవి. నాయికా నాయకుని దర్శించింది. మాటలు మారాం చేశాయి. అయినా నాయిక అంగిక విన్యాసాలు నాయకుని మురిపించాయి నాయిక వట్టుపడింది.

కలికి మాటాడకున్న కంకణాలే మాటలాడే
మలసి యవే తన మారు గావా
కులికి తా చూడకున్న కుచాలు తలెత్తి చూచీ
అలర నవే తన యంగములు గావా

బృందావనంలో నందకిశోరుడు రాసక్రీడ లాడుతున్నాడు. రకాల రాముల్ని మురిపిస్తున్నాడు. ఒక కన్య కన్నయ్య తనతో కట్టివడేశానని అనుకుంటుంది. మరొకతె తన చూపులకు సరాంగుడు బందీ అయినాడని పరవశించింది. ఇంకొకతె నవ్వు నానా హంగామా చేస్తూవుంది అయితే అందరిని ఆ నల్లన ఆకట్టు కుంటున్నాడు. రసరాజ్యంలో భాగస్వాముల్ని చేస్తున్నా ఆ వర్ణన అతిలోక రమణీయం

అదివో కనుగొను మది యొకతె
ఎదుటనె నెలకొనె నిది యొకతె
తేటల మాటల తెరలది కట్టి
కాటుక కన్నుల కలికొకతె
జూటరి చూపుల చొక్కులు చల్లీ
నీటు గర్వమున నెలతొకతె

"వాక్కు లొక్కటే భాషల వరుసవేరు" అని అన్నమం నిర్ణయం. పరమార్థాన్ని పామరులకు బోధించేవేళ పదిమం కి సిన అంశాలను ఉదాహరణగా చెప్పడం సహజ సుందరమవుతుం

"నేను జీవుణ్ణి. నీవు పరమాత్ముడివి. జీవుడయిన నేను తప్పాను. దారి తప్పడం అజ్ఞానంవల్ల కావచ్చు అహంకారం కవచ్చు. కాని దారి మళ్ళించడం నీ ధర్మం" అని చెప్పడానికో ...మయం.

"సొమ్ము గలవాడు తన సొమ్ము చెడనిచ్చునా
కమ్మి నీ సొమ్మును నేను కాపాడనే హరి
వసుర మడవి బడ్డ వసురము గలవాడు
దెసలు వెదకి కింటికి తెచ్చుకున్నట్టు
వసగా ఆసలలోన వడిబడ్డ నా మనసు

ఎసగ మళ్ళించవే" అనడంలో అందరికి తెలిసిన "వసరం" ఉప మానం ఎన్నుకున్నాడు. అలాగే కొన్నిటికి ప్రయత్నాలేవీ అవస రం లేదని, అవి సహజ భావాలని చెప్పిన తీరు కూడా రమణీయం.

కాంత తలచుకొంటేనే కామోద్రేకము పుట్టు
యింతలో కూడెనా ఏడ కేడ సూత్రము
చింతకాయ తొక్కు చూచితేన నోరూరు
ఎంతకెంత దవ్వు ఏడకేడ సూత్రము.

మనిషి సంఘజీవి. సంఘాన్ని వదలి వుండడం సాధ్యమయ్యే విషయం కాదు. సంఘంలో వుంటూ అంటీ అంటనట్టు ప్రవర్తించడం కూడా జరిగే పనికాదు. తనకు కావలసిన శక్తి పై పదవుల్లో వుంటే ఆశ్రయించడం సహజం. తగినంత వరకు తన వారికి సాయం చేయడం తప్పు కాదు. అయితే ఈ ఆదాన ప్రదానాలు విషమించే వేళ వేదనలు తప్ప మరేవీ మిగులవు. అన్నమయ్య మహిమాన్వి తుడని, తపస్సిద్ధి సంపన్నుడని "ఇహం" కోసం అలగా జనం ఎగ బడ్డప్పుడు వీటిని ఈసడిస్తూ చెప్పిన పైనం నవ్వించినా అందులో సత్యాంశం లేకపోలేదు.

మగడు విడిచినా మామ విడువని యిట్లు
నగి నా మనసు [illegible]

పొసగ దేవుడిచ్చినా పూజారి వరమీడు
విసిగినే విడిచినా విడువవు లోకులు

లోకంలో సౌందర్యం రెండు రకాలు. బాహ్య సౌందర్యం. అంతస్సౌందర్యం. అలాగే సహజ సౌందర్యం. అలంకరణ సౌదర్యం. కవితలో కూడా ఈ భేదాల్ని గుర్తించవచ్చు. అన్నమయ్య పండిత పామర కవి. అంతేత పామరుల్ని మెప్పించేలా జానపదగేయ వరుసల్ని ఎన్నుకున్నాడు. జానపదుల భాషను వాడుకున్నాడు. గ్రామీణుల వ్యక్తీకరణ ధోరణిని కవితలో ప్రదర్శించాడు.

సాప నీటి కింది పతి సంక బెట్టుక
తీపుల తిరుమల దేవరైనాడే
గుల్ల సేత బట్టి కొండపై నిలుసుండి
వల్లె వాటువేసి వరము లిచ్చెను.

సరస్వతి కోడలుగా లక్ష్మి అత్తగా ఒకరినొకరు "యద్దేవా" చేసుకుంటూ కయ్యానికి కాలుదువ్వుతుంటే అచ్చమయిన గ్రామీణ జీవితమే కళ్ళకు అనుతుంది. ఈలాగే బావ మరదలు, వదినె-మరిది సంవాదాలు రసరమ్యంగా వున్నాయి.

మనోగతమయిన అభిప్రాయాలను గుర్తించడం వ్యక్తీకరించడం అందరికీ సాధ్యమయ్యే విషయం కాదు. వాగ్గేయకారుల్లో విస్తారంగా దేశాటనం చేసినవాడు అన్నమయ్య. అన్ని వృత్తుల వారితో కలిసి తిరిగి వారి అనుభవాలను తన అనుభవాలుగా మలచుకొన్న మనీషి. ప్రత్యేకించి స్త్రీ పురుషుల చిత్తప్రవృత్తుల్ని అందంగా వర్ణించాడు.

"చిన్నవాడు మోహించిన చెలులు నే చూడగానే
వన్నిన వయసు మీరి ప్రౌఢలైరి"
"మగవాడెంత చక్కని మగువ కలిగినను
మిగుల వేరొకతెతో మేల మాడుదురు"

అనడంలో మగవారి "గుట్టును" బహిర్గతం చేశాడు. అలాగే సమాజంలో కుటుంబంలో ఆడవారు హాయిగా వుండాలంటే అవలంభించవలసిన "చిట్కాలను" గూడా చెప్పాడు.

"మంచి మాట లాడితేను మగడు మోహించునే
వంచన కలిగితేను వసమై యుండునే
మంచి శావలు చేసితే మెగమోట కలుగునే
మించి యీ నేరుపులు మెలగవే చెలియ

సత్యం, శివం, సుందరం అని చెప్పడం క్రమం. సత్యాన్ని సత్యంగా చెప్పడానికి ఎంతో ధైర్యం కావాలి. అన్నమయ్య ధీరుడు. తన కష్ట సుఖాల్ని, తన అనుభవాల్ని దాపరికం లేకుండా చెప్పి వున్నాడు. ముంత నీటిలో మునిగే నికృష్ట బతుకును ఉపదించు కున్నాడు. "వెతల పొరలె ఘనవిభవము కంటె అతి పేదరకమది సుఖము" అని స్పష్టం చేశాడు. ఈలాగే ప్రజల మనోభావాల్ని కూడా సత్యాంశాలను కూడా పదస్థం చేశాడు.

"చేసిన కూలికి జీతములకు సరి"
"తగ చుట్టరికాలలో ధనమే చుట్టరికము"
"అద్దము వంటి వయసు అమ్మువంటి కోపము"
"ఆస కలిగిన చోట ఆడినదె సరసము"
"కనుచూపులు ఒక్కటే కాంక్షలే వేరు"

"జంతగాని తరుణి ఏ జాతైనా నదే చాలు"
"విని కందరికి నొక్కడు వివరములే వేరు"

అన్నమయ్య తిక్కన లాగా తెలుగుపదాలని విరివిగా వాడుతున్న కవి. సహజ సుందరమయిన జాతీయాలతో నానుడులతో కవితను సుసంపన్నం చేసిన మహాకవి. చిరు నవ్వు నిప్పులు. పాముల వలపులు, కొండవంటి కోపము, వలపుల దిష్టి మొదలయినవి రకరకాల నవ్వులు, చూపులు ఇతర కవులలో కనిపించవు. అందువల్లనే రాళ్ళపల్లి వారు

"అదొక సారస్వత క్షీర సముద్రం, కావ్యమూల ధర్మమయిన భావార్ణవంలో, శైలిలో, భావ వైవిధ్యంలో రాశిలో అన్నమాచార్యుని రచనను మించినది ఆంధ్రవాఙ్మయంలో ఇంకొక్కటి లేదు" అని తేల్చి చెప్పాడు.

అన్నమయ్య "పదకవితా సౌందర్య దర్శనం" అఖిలోక రమణీయం. అనంత సాగరం. అనుభవోపేతం. ఆస్వాదయోగ్యం.



౮౧

# తమిళ 'ప్రభులింగలీలై'లో శ్రీశైలం

తెలుగు సాహిత్యంలో శ్రీశైల ప్రసక్తి ఉన్నట్టే తమిళ వాఙ్మయంలో కూడా చాలాచోట్ల శ్రీశైల వర్ణన కనిపిస్తుంది. ఆ వర్ణనల్ని రెండు రకాలుగా వర్గీకరించవచ్చు. స్తోత్ర వాఙ్మయంలో శ్రీశైలం. ప్రసిద్ధ కావ్యాలలో శ్రీశైలం. తేవారంలాంటి నాయన్మార్ల రచనల లోని శ్రీశైలం స్తోత్రవాఙ్మయం లోనిది. కాని ప్రభులింగలీలై వంటి గ్రంథాలలోని శ్రీశైలం కావ్యవాఙ్మయం లోనిది.

"ప్రభులింగ లీల" అనే పేరుతో లఘు కావ్యాలు, మహాకావ్యాలు కన్నడం, తెలుగు, తమిళం, మహారాష్ట్రం, సంస్కృతంలో కనిపిస్తాయి. కన్నడంలో "చామరస" కవి ప్రభులింగలీలె 15వ శతాబ్దం నాటిది. తెలుగులోని ప్రభులింగ లీలలు 15, 16 శతాబ్దం నాటివి. పిడుపర్తి సోమన "ప్రభులింగ లీల"ను ద్విపదలో వ్రాస్తే పిడుపర్తి బసవ కవి పద్య రూపంలో వ్రాశాడు. తమిళంలో ప్రభులింగ లీలై వ్రాసిన వాడు "శివప్రకాశర్" ఈ కావ్య రచనాకాలం క్రీ.శ. 1652. తమిళ నాడులో కంచి ప్రాంతంలోని "వేళాళర్" కులము వారికి దేశికుడు. ఇతడు బహుభాషావేత్త. తర్కం, వ్యాకరణం, వేదాంతం, జ్యోతిష్యం లాంటి శాస్త్రాలలో అసమాన ప్రజ్ఞాపాటవం కలవాడు. కన్నడ ప్రభులింగలీలె ప్రస్తావన గాని చామరస ప్రశంస గాని తమిళ ప్రభులింగ లీలైలో కనిపించవు. ఈ మహాకవి "గోరక్కర్ గతి" అనే భాగంలో శ్రీశైలాన్ని 17 పద్యాలలో వర్ణించాడు కన్నడాంధ్ర ప్రభులింగ లీలలలో ఇంత విస్తృతంగా శ్రీశైల వర్ణన కనిపించదు. తమిళంలోని విస్తృత వర్ణనకు ప్రధానంగా రెండు కారణాలు. మొదటిది కవికి ఆ శ్రీశైలం మీది అనురక్తి. రెండవది కవికున్న వర్ణనా ప్రియత్వం.

తమిళంలో శ్రీశైలాన్ని "తిరుప్పరుప్పదం" అని అంటారు. ప్రభులింగనాయకుడయిన అల్లమప్రభువు బసవయ్య, సిద్ధరామయ్య మొదలయిన వారిని వదలిపెట్టి సుందర రూపంలో గోరక్షకుని కోసం శ్రీశైల ప్రాంతంలో సంచరించడం సన్నివేశం ఈ సన్నివేశంలో "శివప్రకాశర్" శ్రీశైలం ఔన్నత్యాన్ని విశదీకరించాడు. తమిళపద్యా లివ్వడం వల్ల ప్రయోజనం అంతంతమాత్రం కావడంవల్ల ఆ పద్యాల భావాలు పరిశీలిద్దాం.

పగటికి రాజు సూర్యుడు. అతడేమో నిరంతర సంచారి. ఒక్క పట్టాన ఒక్క చోట ఉండడు. నిలదొక్కుకోవడానికి తూర్పు పడమటి కొండలు చాలవు. అంచేత చివరకు చంద్రుడ్ని నెత్తికెక్కించుకున్న మల్లికార్జున స్వామి పాదాల జ్ఞాన సూర్యుడై నిలిచాడట. అలాంటి సూర్యునికి నిరంతర స్థానం నిలబెట్టిన శ్రీశైల మహిమ ఏలాంటిదో ఊహించుకోమన్నాడు కవి.

ఉత్తరాన కైలాసముంది. అదేమో తెల్లగా మెరిసిపోతూ వుందట. ఆ తెల్లదనానికి కారణం కైలాసానికున్న తీర్చలేనిచింత. శ్రీశైలం దర్శించిన వారంతా కాలాంతరంలో కైలాసం చేరుకున్నారట దర్శించడం ఒక పత్వతాన్ని, భారాన్ని మోసేది తానా అంటూ చింతలో కైలాసం తెల్లబడిందని కవి భావన.

కైలాసానికి మాత్రం కాదు మేరు పర్వతానికి కూడా చింత పట్టుకుంది మేరువుకు. స్వామి శ్రీశైలాన్ని ఎన్నుకొన్నట్టు, ఏలు కొన్నట్టు తనకేసి చూడలేదే అనే బెంగ పట్టుకుంది మేరువుకు. ఆ సమ యంలోనే త్రిపురాసుర సంహారం చేయవలసి వచ్చింది శివునికి. అం చేత మేరువును విల్లుగా చేపట్టాడు. అంతమాత్రం భాగ్యానికి మేరువు

మురిసి పోయిందట. బాధతో కుమిలిపోతున్న మేరువును శివుడు వంచ గలిగాడు గాని లేకపోతే వీలవుతుందా అని మేరుపర్వతాన్ని కూడా పొగిడాడు మహాకవి.

మేరు కైలాసాలు మాత్రం కాదు మైనాక పర్వతానికి కూడా శ్రీశైలమంటే అదురు, బెదురు, పర్వతరాజయిన మైనాకుడు కొడుకై ఉండీ కూడా తన్ను "శైల" మనడం లేదు, కేవలం మైనాక పర్వతమంటు న్నారు కదా అనే సిగ్గుతో బతకలేక తలెత్తుకొని తిరగలేక సముద్రంలో పడ్డాడట. మహాదేవుడంటే శివుడు మాత్రమే. అలాగే శైలమంటే శ్రీశైలమని రూఢి.

భారతదేశంలో ఎన్నో పర్వతాలున్నాయి కాని అవన్నీ శ్రీశైలం ముందు దిగదుడుపే. వాటి లోపాలు వాటికున్నాయి. వింధ్య పర్వతం అగస్త్యుని చూసేసరికల్లా పాదాల పడింది. మంధరం పెద్ద పర్వతమే కాని దేవతలు రాక్షసుల మధ్య పడరాని పాట్లు పడింది. అమృత మథన సమయంలో అయినా శ్రీశైలానికి ఈ పాట్లేమీ లేవు. స్వామి సాక్షాత్కరించడంతో సగర్వంగా ఆకాశం కేసి ఎదుగుతూనే వుంది.

శ్రీశైలంలోని సెలయేర్లు, తీర్థాల మహిమ చెప్పడం సాధ్యం కాదు. ముసలివాడయిన తిరునీల కంఠనాయనార్ భార్యతో సహా కంచిలోని కోనేటిలో మునిగితే గాని యువకుడు కాలేదు. పైగా పర మేశ్వరుడే మాయా భిక్షువు రూపంలో ఆదేశించ వలసివచ్చింది. కాని శ్రీశైలంలోని తీర్థాలలో మునిగితే చాలు వయస్సు మళ్ళినవారు కాటికి కాళ్ళు చాచుకొన్నవారు యువకులై ఒడ్లు ఎక్కుతారట.

శ్రీశైలంలో ఎప్పుడూ అవ్యక్తనాదం వినబడుతూనే వుంటుంది. గంధర్వులు ఆకాశంలో వీణమీటుతూ వుంటారట. ఏనుగులాంటి గుట్టల్లో విహరించే వేటగాళ్ళు వేటలో అలసిపోతున్నప్పుడూ వేడుకతో వింటా రట ఆ నాదాన్ని. పైగా అంతస్సమాధిలో మునిగిన యోగులు ఆ అవ్యక్త నాదాన్ని వింటూ ఆనంద పారవశ్యంలో మునిగి తేలుతుంటారట.

శ్రీశైలంలో జ్యోతిర్వృక్షాలెన్నో వున్నాయి. పగటి పూట ఆ వృక్షాలు పసిమిగా కనిపిస్తాయి. పక్షులు ఆ చెట్లల్లో గూళ్ళు కట్టి గుడ్లు పొదిగి ఆహారం కోసం నలుదిక్కుల వెళతాయి. మునిమాపువేళ గూడు చేరుకోవడానికి వచ్చాయి. కాని రాత్రివేళ కావడంతో జ్యోతి ర్వృక్షాలు ప్రకాశిస్తున్నాయట. ఆ ప్రకాశాన్ని చూసి చెట్టుకు నిప్పంటుకుందేమో అని పక్షులు ఆకాశంలో చెట్టూ చుట్టూ తిరుగుతున్నా యట.

శ్రీశైలంలో స్వామి కైంకర్యార్థం పూలతోటలెన్నో ఉన్నాయి. కొన్ని నేల పూలు. కొన్ని నీటిపూలు, కొన్ని తీగెపూలు, కొన్ని చెట్లలో పూసేవి. వాటిలో నల్లని పూలు అందమయిన అమ్మాయి కళ్లలాగా ఉంది. అంటే ప్రకృతి పార్వతి మయంగా పరమేశ్వరుని పక్క ఉందని కవి భావన.

శ్రీశైలంలో ఏనుగు లున్నాయి. సెలయేళ్ళు ఉన్నాయి. ఒక ఏనుగు నీళ్ళకోసం వచ్చింది. తొండంతో నీళ్ళను పీల్చింది. అయినా ఆ ఏనుగుకు ఉన్నట్టుండి ఒక ఆలోచన తట్టింది తొండం ఆకాశం కేసి చాస్తూ పూ పూ అంటూ నీళ్లను విరజిమ్మిందట. సాధారణంగా నీళ్ల ధర్మంబట్టి కింద రాలాలి. కాని ఆకాశంలో ఎగ జిమ్మిన నీటితుంపరలు చంద్రకిరణాలలాగా ప్రకాశిస్తున్నాయట.

శ్రీశైలంలో ఒకానొక ఏనుగుల జంట పారవశ్యంతో తిరుగుతూ ఉందట. మగ ఏనుగు ఆడ ఏనుగుకు ఏదయినా కానుక ఇవ్వాలను కొందట. అంచేత ఓ చెట్టు చిగురుకొమ్మ తుంచింది. పక్కనే ఉన్న శేసెవాకలో ముంచి ఆడ ఏనుగుకు అందించింది. ఆ రెండూ స్ఫటిక శిల మీద వుండడం వల్ల ఆ శిలలో ఆడ ఏనుగు తన ప్రతిబింబాన్ని గుర్తించకుండా మగ ఏనుగు మరొక ఆడఏనుగుకు కానుక ఇస్తున్నట్లు భావించి మొగం ముడుచుకొందట.

కొండలో ఎన్నో వెదుళ్ళ గుంపులున్నాయట. వెదురులో రెండు గణుపుల మధ్యభాగం ధాన్యం కొలిచే కొలపాత్రలాగా ఉందట. ఈ విషయాన్ని స్పష్టం చేయడానికోసం కవి పార్వతీ పరమేశ్వరులకు సంబంధించిన ఒక కథ చెప్పాడు.

ప్రపంచంలోని జీవరాసులకంతా ఆహారం సమకూర్చేవాడు శివుడు. కాని పార్వతి శివుణ్ణి పరీక్షించాలని అనుకొంది. ఒక చీమను దాచింది. అన్ని జీవరాసులకు ఆహారం అందించి శివుడు వచ్చాడు. అన్నిటికి ఆహారమందించారా అని పార్వతి అడిగింది అవునన్నాడు శివుడు. మరి చీమకు సమకూర్చలేదే అంది పార్వతి. కాని తీరా చూసేసరికి చీమ నోట్లో ఒక నూక ఉందదట. పార్వతి పన్నాగం శివునికి తెలిసింది. తన్ను పరీక్షించడం తప్పుకాదు గాని తన భక్త వాత్సల్యాన్ని పరీక్షించడంలో శివునికి కోపం వచ్చింది. భూలోకంలో భక్తులకు ఆహారం సమకూరుస్తూ కాలం గడపమని ఆదేశించాడు. అయినా తనకు ధ్యానం కావాలంది పార్వతి. శివుడు అలాగేఅంటూ శ్రీశైలంలోని వెదురు రెండు గణుపుల మధ్య భాగాన్ని కొలపాత్రగా ధాన్యం ప్రసాదించాడట. అంటే ఆ వెదుళ్ళు ఎంత ఏపుగా బలుపుగా పాత్రలాగా పెరిగాయో కవి ఊహకు వదిలేశాడు.

శ్రీశైలంలో ఎక్కడ చూసినా చెంచు గుడారాలే. ఒక చోట చెంచు దంపతులు కూర్చున్నారు. చెంచిత, చంద్రునిలోని జింక కావాలని మారాం పెట్టింది. జింకను తెచ్చి ఇవ్వడానికి నేనేమి రాముణ్ణా అన్నాడట చెంచు. అంటే చెంచితను వదలివెళితే ఆమెకు ఏ అపాయం వస్తుందో అనే సందేహం. అంతే కాదు చంద్రుని లోని జింకను స్పష్టంగా చూడగలిగేలాగా శ్రీశైల పర్వతం అంత ఎత్తుగా వుందని కవి స్పష్టం చేశాడు.

అన్నీ ఉన్నా శ్రీశైలానికి కూడా తీరని వ్యధ ఉంది. స్వామి శ్రీశైలం చేరుకోవడంతో తనకు కాసంత ప్రసిద్ధి రావడంతో ఇంత వఱకు ఎంతో ఆప్యాయత కనబరచే మేరువు వింధ్య మొదలయిన పర్వత సోదరులు మొగం మాడ్చుకొని దూరమై పోయారు. తన వాళ్ళంతా తనకు దూరమయ్యారనే దుఃఖంతో ఆ పర్వతం కొంత సెలయేళ్ల రూపేణ ఏడుస్తూ తన వాళ్ళంతా తన గోడు చెప్పకొం టుందట.

కొండంతవాడు శ్రీశైలం దగ్గర గుజ్జు కావలసిందే. అంటే త్రివిక్రమరూపుడు కూడా స్వామి దగ్గర సాష్టాంగ నమస్కారం చేస్తు న్నాడన్నమాట. ఒక పేదవాడు కట్టెలు కొట్టి బ్రతుకుదామని గొడ్డలితో చెట్టు కొడితే అది కాస్త బంగారమయి పోయిందట. ఆ బంగారం అమ్ముకొని హాయిగా బ్రతుకు గడుపు తున్నాడట.

శివప్రకాశస్వామి శ్రీశైల మహిమను పురాణకథలలో, సహజ మయిన ప్రకృతి సౌందర్య వర్ణనలతో కళ్లకు గట్టేలా వర్ణించాడని సారాంశం.



# పురందరదాసు - త్యాగరాజు

కావేరీ నది కొడకు కొండల్లో పుట్టి కర్నాటకాన్ని సస్యశ్యామలం చేసి తమిళనాడులో ప్రవేశించి తంజావూరు మండలాన్ని పావనం చేసిందనడం భౌగోళిక సత్యం కేవలం నదీ ప్రవాహ విషయంలో మాత్రం కాదు. సంగీతాన్ని ఆదరించడంలోను ఇది సత్యం ఈ కర్ణాటక సంగీతాన్ని అభిమానించి ఆస్వాదించి అందరికి పంచి పెట్టిన మహనీయులు పురందరదాస త్యాగరాజులు. వీరిద్దరిని తుల నాత్మకంగా పరిశీలించడం ఈ వ్యాసప్రధానాంశం.

## పురందరదాస త్యాగయ్యల జీవితకాలం :

పురందరదాస త్యాగయ్యలలో పురందరదాసు పూర్వీకుడు. ఇతని గురించి తెలుసుకోడానికి ప్రధానంగా ఐదు ఆధారాలున్నాయి. మొద టిది 24-2-1556 నాటి వ్యాస రాయల శాసనం రెండవది తాళ్లపాక చిన్నన్న వ్రాసిన అన్నమాచార్య చరిత్రము. మూడవది కన్నడ వాగ్గేయకారులయిన ప్రసన్న వెంకటదాసు, విజయదాసుల దేవర నామగళ్లు. నాల్గవది పురందర దాసులవారి కీర్తనలు. ఐదవది ప్రజ లలో పరంపరగా పురందరదాసు సంబంధించి వినవస్తున్న కథలు.

త్యాగయ్యను గురించి తెలుసుకోవడానికి మూడు ఆధారా లున్నాయి. మొదటిది స్వామివారి శిష్యులయిన వాలాజపేట వెంకట రమణ భాగవతర్ అతని కుమారుడు కృష్ణస్వామి భాగవతర్ వ్రాసిన వ్రాసుకొన్న తాళపత్రాలు, నోట్పు పుస్తకాలు రెండవది త్యాగయ్య కృతులు. మూడవది త్యాగరాజస్వామికి సంబంధించి ప్రజలలో

వివవస్తున్న కథలు. ఏది ఏమయినా వీరిద్దరు చారిత్రక పురుషులు. సంగీత ప్రపంచంలో సూర్య చంద్రులు, లభ్యమయిన ఈ ఆధారాలతో ఈ వాగ్గేయకారుల్ని నాల్గుకోణాలతో తులనాత్మకంగా పరిశీలించవచ్చు.

## వైయక్తిక జీవితం :

పురందరదాసు త్యాగయ్యల వైయక్తిక జీవితం తెలుసుకోవడంలో మొదటి ఆధారం వారికి సంబంధించిన కథలే. పురందరదాసుల వారు 1485-1565 నాటి వాడని చాలా మంది అభిప్రాయం.

పురందరదాసు తల్లిదండ్రుల పేర్లు తెలియవు గాని త్యాగయ్య తండ్రి రామబ్రహ్మం "సీతమ్మ మాయమ్మ" అనడం వల్ల త్యాగయ్య తల్లి పేరు "సీతమ్మ" అని పరిశోధకుల అభిప్రాయం.

పురందరదాసు ఇల్లాలు "సరస్వతి" అని ప్రచారంలో ఉంది. త్యాగయ్యకు ఇద్దరు భార్యలు మొదటి భార్య పార్వతి. పార్వతి చనిపోగా త్యాగయ్య కమలమ్మను పెళ్ళిచేసుకున్నాడు. పురందరదాసుల వారికి ముగ్గురు కుమారులని వ్యాసరాయల శాసనం చెబితే దాసుల వారికి నలుగురు కుమారులని ఒక కుమారుడు మరణించాడని వీళ్ళే కాకుండా మరొక కుమార్తె కూడా ఉండేదని ప్రచారం వుంది. త్యాగయ్యకు కొడుకులు లేరు, ఒక కుమార్తె మాత్రమే పురందరదాసుల వారికి అన్నదమ్ములున్నారో లేదో తెలియదు గాని, త్యాగయ్యకు జపేశయ్య, రామనాథమనే ఇద్దరు సోదరులు.

పురందరదాసుల వారు ఎవరి దగ్గర ఎంత చదువుకున్నాడో అంతు పట్టదు గాని వ్యాసరాయులు మెచ్చుకున్న శిష్యుడనడములో రెండవ

అభిప్రాయం లేదు. కాని త్యాగయ్య అయ్య దగ్గర మాత్రం కాదు అయ్యర్ల దగ్గర కూడా బాగా చదువుకున్నాడు. దొరుకునా ఇటువంటి శిష్యుడు అనేదాకా శొంఠి వెంకటరమణయ్య దగ్గర సంగీత రహస్యాలు నేర్చుకున్నాడు తాగయ్య తేల్చి చెప్పాలంటే పండితవంశంలో పుట్టిన వాడు త్యాగరాజు పండితుల్ని పామరుల్ని మెప్పించిన వాడు పురందరదాసు.

పురందరదాసు సాక్షాత్ శిష్యులంటూ ఎవరూ లేరు. వీధిలో పాటలు పాడుతూ కదలుతుంటే వంతపాడిన ప్రతివాడు శిష్యుడే. అనంతరకాలంలో ప్రసన్న వెంకటదాసు, విజయదాసు, జగన్నాధదాసులకు స్ఫూర్తి యిచ్చినవాడుపురందరదాసు త్యాగయ్య శిష్యగణానికి అంతే లేదు. సంతానంకంటే మిన్నగా శిష్యుల్ని అభిమానించిన కీర్తి త్యాగయ్యది. అంచేతనే ఈనాటికి త్యాగయ్యతోపాటు వాలాజపేట వెంకటరమణ భాగవతర్, లాల్గుడి రామయ్యర్ తిరువొత్తియూరు వీణా కుప్పయ్యర్లను తలచుకోవడం సంగీత సంప్రదాయం సమకాలీనుల జోలికి వస్తే వ్యాసరాయలు కనకదాసు మొదలయిన హరిదాసులు, శ్రీకృష్ణదేవరాయలు, అచ్యుతరాయలు, అళియ రామరాయలు, మొదలయిన మహారాజులు పురందరదాసు కాలంనాటి వారే. త్రిభువనం స్వామినాధయ్యర్, తూము నరసింహదాసు, గోపాలకృష్ణభారతి మొదలయిన సంగీతజ్ఞులు స్వాతి తిరునాళ్, శరభోజి మహారాజు మొదలయిన సంస్థానాధీశులు త్యాగయ్య కాలంనాటివారే.

ఇక వీరిద్దరు తమ జీవితంలో ఎదుర్కొన్న ఇబ్బందుల్ని పరిశీలిస్తే చాల తేడా కనిపిస్తుంది బాల్యం నుండి భక్తుడు త్యాగయ్య నడిమ కాలంలో జ్ఞానోదయమయితే నారాయణసేవకు అంకిత మయిన వాడు పురందరదాసు. సామాన్య కుటుంబీకుడు త్యాగయ్య, సంపన్న

జీవితం గడిపినవాడు పురందరదాసు, శరభోజి మహారాజు ప్రలోభానికి తలవంచినవాడు త్యాగయ్య, శ్రీకృష్ణదేవరాయలు పెట్టిన భక్తి పరీక్షలో నిలదొక్కుకున్న నిండు మనిషి పురందరదాసు శిష్య పరమాణువులతో సంకీర్తన భజనలకు తాను ముందుగా అడుగులు వేసినవాడు త్యాగయ్య కట్టుకున్న భార్యతో కదులుదామన్న కొడుకులతో పూరూరు తిరిగినవాడు పురందరదాసు. పూజా విగ్రహాలు పోతే విలపించినవాడు త్యాగయ్య పురుషోత్తముడు సర్వత్రా వున్నాడని విశ్వశించినవాడు పురందరదాసు. పరిమిత జనం మధ్య ప్రశంస అందుకున్నవాడు త్యాగయ్య పండిత పామరుల నాలుకలలో నడయాడుతున్నవాడు పురందరదాసు.

## పురందరదాసు – త్యాగయ్యల రచనలు :

పురందరదాసుల వారు 4,25,000 పదాలు వ్రాసిన వాడని ప్రసిద్ధి. ఇందులో గీత, రాయి, సుళాది, ఉగాభోగ, పద్య పదాలనే ఆరు రకాలయిన ప్రబంధ ప్రక్రియ లున్నాయి. అయితే ఈనాడు దొరికే పురందరదాసు రచనల్లో 60 కంటే మించి సుళాదులు లేవు 140 కంటే మించి ఉగాభోగలు లేవు అక్కడా ఇక్కడా దొరికిన 1500 పదా లలో నికరంగా పురందరదాసుల వారివని చెప్పదగ్గవి 1000 మాత్రమే. త్యాగయ్య రామాయణ శ్లోక సంఖ్యకు దీటుగా 24 వేల కీర్తనలు వ్రాసి నట్లు ప్రతీతి, పైగా సీతారామ విజయం నౌకాచరిత్రం, ప్రహ్లాద భక్తి విజయం, శతరాగరత్న మాలికలు, కృతులు, కీర్తనలు, నామావళులు వ్రాశాడని అంటారు అయితే లభ్యమయినవి. నౌకాచరిత్రం, ప్రహ్లాద భక్తి విజయమనే నాటకాలు సుమారు 700 కీర్తనలు మాత్రమే.

## మతం :

మతం జోలికి వస్తే పురందరదాసు మాధ్వుడు. త్యాగయ్య స్మార్తుడు. పురందరదాసు వ్యాసరాయల "దాసకూటానికి" చెందినవాడు కావడం వల్ల మతప్రచారకుడు కూడా కాని త్యాగరాజస్వామి ఏ "కూటానికి" అంకితమయిన వాడు కాదు. పురందరదాసు మధ్వుడు కావటం వల్ల వ్యాసరాయల ఆదేశం కూడా వుండటం వల్ల ద్వైత్యమతాన్ని గురించి ఆచార వరంపరల గురించి కొంత చర్చ చేశాడు. అయితే పురందరదాసుల వారి సంకీర్తనల్లో ఇవి 40 కంటే మించడం లేదు. అయితే ఒక మతంపై అనురక్తి మరో మతం పట్ల అన్యదాభావం త్యాగరాజులో ఎక్కడ కాగడా పట్టి వెతికినా కనిపించదు కాకపోతే ఒకచోట మాత్రం ద్వైత్యము సుఖమా అద్వైతము సుఖమా అనే సంశయం కనిపిస్తుంది ఆలయదర్శనం.

పురందరదాసు త్యాగరాజాదు లిద్దరు విస్తృతంగా క్షేత్ర వర్యటన చేసినవారే. పురందరదాసు ఒక లక్ష క్షేత్ర సంకీర్తనల్ని వ్రాశాడని ప్రతీతి. ఆ వాగ్గేయకారుడు కర్ణాటాంధ్రతమిళ ప్రాంతాలను బాగా తిరిగినట్లు ఆధారాలున్నాయి. అయితే త్యాగయ్య కృతులలో తమిళనాడు దేవాలయ ప్రవక్తి విరివిగా ఆంధ్ర ప్రాంతంలోని కొన్ని క్షేత్రాలుమాత్రం కనిపిస్తున్నాయి. పురందరదాసులో వైష్ణవాలయాల ప్రవక్తి హెచ్చయితే త్యాగయ్య కీర్తనలలో శివాలయాలు, అమ్మవారి ఆలయాలు చోటు చేసుకున్నాయి. వీరిద్దరు దర్శించిన క్షేత్రాలు శ్రీరంగం, తిరుపతి, ఘటికాచల మనబడే షోళింగర్ సమానమయినవి అయితే తిరుపతి శ్రీనివాసుని మీద లెక్కలేనన్ని కీర్తనలు వ్రాసిన ఘనత పురందరదాసుల వారిదే.

ఒక క్రమసంఖ్యలో నిర్దిష్టంగా క్షేత్ర సంకీర్తన చేసినవాడు త్యాగయ్య. అందువల్లనే నేటికిని సంగీతలోకం తిరువొత్తియూరు పంచరత్నాలు, కోవూరు సుందరేశ్వరస్వామి పంచరత్నాలు. శ్రీరంగ పంచరత్నాలు లాల్గుడి పంచరత్నాలని ప్రత్యేకించి స్మరించుకొంటూ వుంది.

## ఆరాధించే దేవతా మూర్తులు

పురందరదాసుల సంకీర్తనల్లో శ్రీకృష్ణా సంకీర్తనలు లెక్కువ దీనికి ప్రధాన కారణం దాసుల వారి ఆరాధ్య దైవం "పురందర విఠలుడు" కావడం పైగా మాధ్వులకు కృష్ణుడు ఇష్టదైవం కావడం అయితే తాగయ్య కృతుల్లో శ్రీరామ సంకీర్తనలే ఎక్కువ అంత మాత్రాన పురందరదాసు పదాలలో రామనామ కీర్తనలు లేవనికాదు రామనామ పాయసక్కె కృష్ణనామసక్కరె రామమంత్రవజపెనోమనుజ రాము రామ రామ సీతారామ ఎన్నిరో రామ రామ ఎంబో ఎరతక్షరద అనేవి అతని రామభక్తిని స్పష్టం చేస్తున్నాయి. ఎంత రామకోటి జపించినా, రామనామ సంకీర్తనలు వ్రాసినా ప్రజలకు కృష్ణ చరితం బాగా రుచించడాన్ని పసిగట్టి త్యాగయ్య కూడా చివరకు "నౌకాచరితం" మనే కృష్ణ ప్రాధాన్య యక్షగానం వ్రాయక తప్పలేదు.

పురందరదాసుల వారు చెదరు మదురుగా నరసింహ మహిమల్ని నరసింహ మంత్ర వొందిరలు పాకు, నరసింహ పాద భజనెయ మాడో అని వ్రాస్తే త్యాగరాజస్వామి "ప్రహ్లాద భక్త విజయం" మనే యక్ష గానం వ్రాశాడు.

దాసుల వారికి హనుమంతుడు కేవలం రామభక్తుడు మాత్రం కాదు. సాక్షాత్ మధ్వాచార్యులే. కాని త్యాగయ్యకు అతడు నవ వ్యాకరణ పండితుడు. వీణా వాదన చతురుడు. సంగీత శాస్త్ర

ప్రవర్తకుడు. గీతార్థాన్ని సంగీతానందాన్ని సమన్వయించుకొని బ్రహ్మానందమందిన మహానీయుడు దాస్యభక్తికి "లక్షణం" నిరూపించినవాడు.

పురందరదాసుల వారు మాధ్వుడయినా శివుణ్ణి సేవించినవాడే తిరువణ్ణామలై దేవుని కరుణానిధియే ఈశ అరుణగిరియవాప అని కాశీ విశ్వనాథుని గంగాతీరదమనె నమ్మదు కాశి అని కాశీ విశ్వనాథుని చంద్రచూడ శివశంకర పార్వతీ అని కుంభకోణేశ్వరుని కీర్తించిన వాడె.

## భక్తి విభేదాలు :

భక్తి ముక్తికి సోపానం త్రిమతస్థులకు "భక్తి" పట్ల విభేదం ఏమాత్రమూ లేదు. భగవంతుని దివ్యమంగళ స్వరూపాన్ని పవిత్ర ప్రతిమలందో తీర్థాదులందో ఆవాహనం చేసి సోదరోపచారాలతో పూజ చేయడం ఫల రూపమయిన భక్తి త్యాగయ్యలో ప్రతిమా పూజనం నామస్మరణం, మానసిక భక్తి కీర్తనలు కనిపిస్తాయి. పురందరదాసు సామాజిక శ్రేయస్సు లక్ష్యంగా తిరిగినవాడు కావడం వల్ల ప్రతిమా పూజాదికాల కీర్తనలు వ్రాయలేదు. అయితే పురందరదాసు నవవిధ భక్తి విభేదాల్ని గౌరవించాడు.

"నవరత్నగళు కండ కండ తావినలి పుంటె
నవవిధ భకుతి కండ కండ వరిగుంటె దేవ"

నవరత్నాలు ఎక్కడపడితే అక్కడ వుంటాయా - నవ భక్తులు ఎవరికంటే వారికి అబ్బుతాయా అన్నది దాసుల ప్రశ్న.

పురందరదాసు సంకీర్తనల్లో "వాత్సల్య భక్తి" కీర్తన లెక్కువ. త్యాగయ్యలో చాలా తక్కువ. దీనికి కారణాలు రెండు మొదటిది దాసుల వారు వైష్ణవ పరంపరకు చెందిన వారు కావడం,

రెండవది ఈ కీర్తనలు సామాన్యుల్ని ఆకట్టుకోవడానికి ప్రత్యేకించి స్త్రీ వర్గాన్ని తన వెంబడి ఆరాధనలో భాగం చేయడానికి వీలు కల్పిస్తాయి. వాత్సల్యంలో బెదిరింపు, భయం, ఆర్తి, ఆవేదన అన్నీ భాగాలవుతాయి బెదరింపుకు

నాల్కు ముఖద బూచి బందు గోకులక్కె ఓడిబందు
లోకరన్ను ఎళెదుకొండు కాకు ముది బయ్యువుదక్కె
బూచి బందదె రంగ బూచి బందిదె

పిల్లల్ని నిదరపుచ్చడం ప్రస్తుత విషయం నిదర పుచ్చడంలో భయపెట్టడం ఒక భాగం. వికృత కార్యదర్శనం భయానికి మొదటి మెట్టు. గోకులంలో నాలుగు ముఖాల బూచి తిరుగుతుందని భయపెట్టడం సామాన్య విషయం అయితే నాలుగు ముఖాల బూచి అనడంలో చతుర్ముఖుడు స్వామి ఆజ్ఞకోసం వేచి వున్నాడని వ్యంగ్యం అలాగే

ఏను మాడలో మగనె యాకె బెళగాయితో

బిడ్డా! ఏం చేయనురా ఎందుకు తెల్లవారిందో కదా అనడంలో ఆవేదన ఉజల్లి యాకొ కంద అవగోవళతియర

కణ్ణు దిష్టి తాకితయ్యొ

నాన్నా! ఎందుకు తినడం లేదయ్యా. ఏ గోపికల దిష్టి తగిలిందేమో అనడంలో ఆర్తి

అడ హోగలు బేడవో రంగయ్య
బేది కొంబెనో నిన్న

డుకోవడానికని వెళ్ళని అనవసరమైన రచ్చలు తీసుకురావద్దు. నిన్ను మరీ మరీ వేడుకుంటున్నా అనడంలో అల్లరిక విసిగిపోయిన తల్లి ప్రార్థన మొదలైనవి కనిపిస్తాయి.

త్యాగయ్య సంకీర్తనలలో "రామ రామ రామ లాలీ" అనే కృతి లోను నాయెడ వంచన సేయకురా అనే కృతిలోను రాను సంబంధ మయిన వాత్సల్యం కనిపిస్తుంది. అయితే పురందరదాసు వాత్సల్య వర్ణనలాగా హృదయానికి హత్తుకోదు.

ఇక మధుర భక్తి వేదాంతం ప్రకారం భగవంతుడొక్కడే పురుషుడు తక్కిన వారందరు స్త్రీలే అందువల్ల భక్తుడు తన్ను స్త్రీగా భావించుకొని భగవంతుణ్ణి ప్రార్థించడం భగవత్సాన్నిధ్యానికి పరితపించడం మధుర భక్తిలో ఒక భాగమే పురందరదాసు తం పదాలలో కొన్నిచోట్ల వాచ్యాంగా మరికొన్నిచోట్ల గోపికల ముఖతం మధుర భక్తిని సృష్టన చేశాడు.

తంగాళి వశ వల్లవె
అంగళ దొళగె బెళదింగలు తుంబితు

దక్షిణానిలం వీస్తున్నది ఈ గాలికి ఓర్చుకోలేకున్నాను ఇంటా బయట వెన్నెల పిండి ఆరబోసినట్లున్నది కృష్ణుడు లేక ఇవన్నీ వ్యర్థమై పోయింది అని ఆవేదన

అన్న పాన రుచియాగి తోరలిల్ల నిన్నాణె
కణిగె నిద్దె బారదు

అన్నపానాదులు రుచించడం లేదు నీ అనసుమా కంటికి కునుకు లేదు అనడంలో విరహం వ్యక్తం.

త్యాగయ్య సంకీర్తనలలో కూడా మధురభక్తి వుంది. అయితే చాలా తక్కువ. కారణం వారు ఆరాధించిన దేవతా మూర్తులే ఒకటి రెండు చోట్ల మధురభక్తి ఛాయలున్నాయి.

వంకరనయన ! నా కుంకుమ నీవె
"మహీజ రీతి నన్ను మన్నించిన నీదు
మహిమకేమి తక్కువ ఓ రామ"
నీరజ నయన ! ఒక ముద్దీర ధీరముంగల
బంగారు వల్వలు నే బాగుగ కట్టెద మరి
మరులు గొంటిని ఇందాక ఏ పామరులు శపించిరో

దాస్యభక్తి ప్రదర్శనలో పురందరదాసుల వారికంటే త్యాగయ్య మిన్న. ఆ మహానుభావుడు కోరుకున్నది కోదండపాణి కొలువు. రోమాంచం, వరకంచుకం, రామ భక్తుడవటం ముద్రబిళ్ళ రామనామమే కరవాలం, అంతే కాదు. ప్రాతఃకాల సేవనముకూడా కొలువు. త్యాగయ్య "బంటు రీతి కొలువీయవయ్య రామ" వంటి కీర్తనలు ఏ వాగ్గేయకారుడూ వ్రాయలేదనడం సత్యం పురందరదాసు పదాలలో "దాస్యభక్తి" ప్రదర్శన తక్కువ.

నిన్న కాల హెజ్జెయ పిడుదు నా నిలువె
నిన్న చత్ర ఛామర పిడిదు ఏళువె

నీ కాలి గజ్జెల్ని పట్టుకొని సదా వుంటాను నీ చత్ర ఛామరాలను మోస్తాను.

నిన్న తొందరిగె కైకూడువె
"నీ భక్తులకు చేతులు జోడిస్తాను"

## మౌలిక సత్యాలు :

మతాలు వేరయినా మహాపురుషులకు మౌలిక సత్యాల పట్ల అభి ప్రాయభేదం లేదు వారి వుపదేశాలలో నాటి, నేటి రెండూ కనిపి స్తాయి. సామాజిక దుర్గ్యత తొలగించడం వారి ధ్యేయం. ఆ తరువాత మనిషి మంచి వానిగా తీర్చడం వారి లక్ష్యం ఆ తరువాత సుఖ సంసారానికి చిట్కాలు చెప్పడం వారి ఆశయం.

కుల నిందకు సంబంధించిన విసురులలో పురందరదాసు విమర్శ చాలా ఘాటయింది. సమకాలీన హరిదాసులలో కనకదాసును అభిమా నించిన వాగ్గేయకారుడు పురందరదాసు వ్యాసరాయలంతటి వారి మన్ననలు పొందిన కనకదాసుల వారికి కూడా సాటి వారి చులకన తప్పలేదు. ఈ ఈసడింపుకు పురందరదాసులవారు నొచ్చుకొని

"ఆవకులదన నాదరేను ఆవనా దరేను ఆత్మ
భావ వరిత మేలె"

ఏ కులస్థుడయినా నేమి-ఎవరయితే నేమి-ఆత్మ భావాన్ని తెలుసుకున్న తరువాత

కులద మేలె హోగ బేడ మనుజ
కుల విల్ల జ్ఞాని గళిగె

కులానికి సంబంధించిన వాదోపవాదాలు బేషజాలు వద్దు జ్ఞాను లకు కులమన్నది కదయ్యా అనడం కొరడా దెబ్బ వంటిది.

రెండవది కర్మకాండ నిరసన యాగాలవల్ల యజ్ఞాదుల వల్ల మోక్షం దక్కుతుందనే ఆత్మ విశ్వాసంతో ప్రవర్తించేవారిని ఈ వాగ్గేయ కారులు సూటుగానే విమర్శించారు.

మరెయు బేడ మనవె నీను హరియ స్మరణయ

యాగ యజ్ఞ మాడలేకె యోగయుతియు ఆగలేక

మనసా ! హరిస్మరణ మాత్రం ఎపుడూ మరచి పోద్దు ఏవో తాత్కాలిక ప్రయోజనం కోసం యాగాల్ని చేయడమెందుకు? ముక్తి కోసరి యోగి కావడమెందుకు? అన్నది దాసుల వారి ప్రశ్న. ఈలాగే త్యాగయ్య

"రాగ లోభ యుత యజ్ఞాదులచే

భోగము లబ్బుట యది వదవా

కర్మ కాండ మతా కృష్టులై భవ

గహన చారులై గాసి చెందగ" అని విమర్శించాడు.

ఆచారాలే పరమార్థమనుకున్న వారిని కూడా ఈ వాగ్గేయ కారులు వదిలి పెట్టలేదు

"వదమ నాభ నల్లి లేక భరుతి ఇల్ల

ఉదయకాలదలి ఎద్దు గడ గడ నగుత

నది యల్లి పిగుతలి" అనడంలో నదీ స్నాన డాంబికాచారాన్ని నిరసించాడు. అచ్చంగా త్యాగరాజు కూడా

"వాన నీట మునుగ మునుగలోని

వంచన ద్రోహమను కర కోవునా"

"వేగ లేచి నీట మునిగి భూతి పూసి

వేళ్ళ నెంచి వెలికి శ్లాఘనీయులై"

అని విమర్శించాడు.

మానవుడు సంఘజీవి ఎంత వద్దనుకున్నా సంఘంలో మంచి చెడులకు ఆనరాగా కొందరితో పరిచయం మరి కొందరితో స్నేహం

పెంచుకోవడం తప్పనిసరి: మరి బంధువులతో జాగ్రత్తగా మసలుకోవలసిన అవసరం ఎంతయినా వుంది. బంధువుల రాగద్వేషాలు బాంధవ్యం వల్ల కలిగే కష్ట నిష్ఠూరాలు చాలా జాగ్రత్తగా గుర్తించిన వారు కావడం వల్ల ఈ వాగ్గేయకారులు సామాన్య ప్రజానీకానికి నీతులు చెప్పారు.

కొట్టు కొంబున నెంటరొడనె ద్వేష బేడమ్మ
ఇచ్చి పుచ్చుకొనే బంధువులతో ద్వేషం పెంచుకోవద్దు
కెట్టూ వెంటర పేరుదుపు బహుకరిణ

అన్ని విధాల పొడయి బంధువుల వంచ చేరడం చాలా కష్టం
పలుకు మంచి గాని బాంధవులు మరి
బావ మరదు అక్క అన్న దమ్ములు
కలిమి చూచు వారు లేమిని
కనుల కాంచరారు

బాధల్లో మునిగిన వాళ్ళకి బంధువులాంటి వారు మహాపురుషులు వారు చాటి చెప్పే నీతులు సార్వత్రికాలు అని హైయుక్తికంగా పైకి కనిపించవచ్చు గాని అవి సాంఘిక సత్యాంశాలే

సొల మారు బేడ సొలదు ఎనబేడ
అప్పు చేయ వద్దు చాలదని చెప్పవద్దు
జ్ఞానవంతరిగె విధి కాడ పుదు సత్య
జ్ఞానుల్ని విధి పీడించడం యదార్థం

సత్యవంతర గిదు కాల విల్ల - దుష్ట
జరిగె మభిక్షకాల

సత్యనిష్టులకు ఇది తగిన కాలం కాదయ్యా - దుర్మార్గులకు
చాలా మంచిరోజులు

బంద కష్టగళెల్ల తాళికో బలు
సందేహ బందదల్లి కేళికో
నిందా స్తుతి గళ తాళికో గోవింద నమ్మవ
నెందు హేళికో

కష్టాలు వచ్చిన వేళ ఓర్చుకో సంశయాలు వచ్చిన వేళ అడిగి తెలుసుకో నిందాస్తుతుల్ని సమానంగా పేరిజు చేసుకో గోవిందుడు మనవాడేనని చెప్పుకో

## సంగీతారాధన :

కర్ణాటక సంగీతమంటూ నేడు మనం వ్యవహరించె సంగీతంలో మార్పులు విజయనగర కాలం నాటినుండే వచ్చాయనడంలో అభిప్రాయ బేదం లేదు. ఈ కాలంలోనే జానపద బాణీలు సంస్కారం పొంది కొత్త రాగాలుగా రూపుదిద్దుకున్నాయి. పురందరదాసు విజయనగరకాలం నాటి వాడు కావడం వల్ల తన కాలం నాటి జానపద గేయ వరుసల్ని బాగా వాడుకున్నాడు. బహుశః పురందరదాసుల వారికి తాళ్లపాక అన్నమయ్య ఇందుకు చోదకుడు కావచ్చు. త్యాగయ్య కాలం నాటికి సంగీతం రూపు దిద్దుకోవడం వల్ల త్యాగయ్య కృతుల్లో జానపద బాణీలు చాలా తక్కువ కనిపిస్తాయి.

సంగీత శిక్షణలో నేడు సామరస్య వరుసలు, జంట వరుసలు తగ్గుస్థాయి తారాస్థాయి అలంకారాలు, పిళ్లారి గీతలు, సంచారి గీతాలు లక్షణ గీతలు, స్వరజతి, వర్ణ, కృతి, మొదలయిన వాటిని పూర్తి చేసి

పదం, తిల్లానా, జావళి, పల్లవి, శ్లోకాలను పఠించడంఅనవాయితి వీటిలో సరళ వరుసల్ని, జంట వరుసల్ని, అలంకారాల్ని పిళ్ళారి గీతాల్ని పురందరదాసుల వారే కూర్చారని ప్రసిద్ధి.

పురందరదాసుల వారు పాట పాడే వారిని గురించి చాలా చోట్ల అభిప్రాయాలు వ్యక్తం చేశాడు

తాళబేకు తక్క మేళ బేకు శాంత
వేళె బేకు గాననన్ను కెళబేకెంబు వరిగే
యతి ప్రాస ఇరబేకు గతిగె నిల్లసెబేకు
రతిః తిపితనొళు అతి ప్రేమ విరబేకు
గతి శుద్ధ నిరబేకు తిళిదు వేళలు బేకు
కళవళ బిడ బేకు కళెముఖ యిరబేకు

తాళం వుండాలి తాళానికి తగిన మేళం కావాలి ఒడిదుడుకులు లేని ప్రశాంత సమయం కావాలి. యతిప్రాసలుండాలి గతి అను సరించి నిలపాలి. నారాయణుని పట్ల భక్తి వుండాలి. గతి శుద్ధి వుండడంతో పాటు మరల తిరగి చెప్పే నైపుణ్యం వుండాలి. కలవర పాటు అసలు పనికిరాదు, పాడే వాగ్గేయకారునిలో "కళ" వుండాలి. అంత మాత్రం కాదు సభలో తెలిసిన వాడుండాలి. విన్న వారిలో పారవశ్యం పెరగాలి. అన్నదే దాసులవారి ధ్యేయం. ఈ విషయాన్నే త్యాగరాజస్వామి భగ్యంతరంగా

"సొగసుగా మృదంగ తాళము జత గూర్చి
నిను జొక్కజేయు ధీరుడెవ్వడో" అని అన్నాడు.

పైగా సంగీత ప్రాముఖ్యాన్ని, నాదతనుం శోభిల్లు సప్తస్వర సుంద రుల భజింపవే సంగీత శాస్త్ర జ్ఞానము భక్తి వినా సన్మార్గము కలదె

మోక్షము కలదా భువిలో జీవన్ముక్తులు కానివారలకు సాక్షాత్కార నీ సద్భక్తి సంగీత జ్ఞాన విహీనులకు, సంగీత శాస్త్ర జ్ఞానము, సారూప్య సౌఖ్యదమే వంటి కీర్తనలలో వర్ణించాడు. సంగీత శాస్త్ర ప్రాముఖ్యాన్ని మరింత విశదం చేసినవాడు పురందరదాసు. అతని దృష్టిలో తంబూర మీటినవాడు భవాబ్ధి దాటినవాడు. తాళం తట్టిన వాడు, దేవగణంలో చేరినవాడు. పాట ఆలపించినవాడు పరమాత్ముని చూసినవాడు.

పురందరదాసుల వారు 32 రాగాల ప్రశంసలు చేశారు మహా పురుష లక్షణాలు 32. 32 అక్షరాల గ్రంథ సముదాయం గ్రంథం. త్యాగయ్య 63 రాగాల ప్రశంసలు చేశాడు వీరిద్దరి రచనల్లోను శుద్ధ సంగీతాత్మకాలు నాట్యాత్మకాలు, సంగీతాభినయాత్మక కృతులు న్నాయి. దాసుల వారిలో గీత (గేయ ప్రాధాన్యమయిన లఘుకృతి తాయి (మనోధర్మ ప్రదానమయిన విలంబిత లయ వున్న) అనిబద్ధ రాగకృతి సుళాది (తాళమాలిక ప్రబంధం) ఉగాభోగ (వచనశైలిలో మాత్రా గణాలతో లయబంధంతో కూడిన సాహిత్య కృతి) కనిపిస్తే త్యాగయ్య కీర్తనలలో సుళాదులు, ఉగాభోగలు కనిపించవు.

## ఆరాధనా క్రమం :

పురందరదాసు పండరపురం దేవాలయంలో ఒక కంబం దగ్గర కూర్చుని పాడేవారని ప్రసిద్ధి ఇప్పటికి దానిని పురందరదాసుకంభ, సోళవా కంబ అని భక్తులు నిర్దేశించి నమస్కరిస్తుంటారు. దాసుల వారు హంపిలో తుంగభద్రా నదీ తీరంలో బృందావనస్థులయ్యారు.

త్యాగయ్య తిరువైయారులో తనువు చాలించారు. బెంగుళూరు నాగరత్నమ్మ వంటి భక్తులు ఆదాయమంతా ఖర్చుపెట్టి ఆరాధనోత్స వాలు మొదలు పెట్టారు. ఇప్పటికి త్యాగయ్య ఆరాధనోత్సవాలు

జాతీయస్థాయిలో జరుగుచున్నాయి. ఆరాధనలో ఘనరాగ పంచరత్న మాలికలు పాడటం పరవశింపజేసే దృశ్యాలలో ఒకటి.

పురందరదాసుల వారు సమకాలీనుల మెప్పు పొందిన వాగ్గేయ కారుడు వ్యాసరాయులంతటి వారు "దాసరెందరే పురందరదాసరయ్యా దాసులవారంటె పురందరదాసులవారే అని శిష్యుల్ని పొగడడం వింతలో వింత. ఆనారదరె పురందరదాసరు అని విజయదాసుల వారు శ్లాఘించారు. "దాసరాయా పురందరదాసరాయా" అని జగన్నాథదాసుల వారు నమస్కరించారు.

త్యాగయ్యకు వచ్చిన వాగ్గేయకారులు పురందరదాస, రామదాసు తల్లి పురందరదాస పదాలు పాడుతుంటే త్యాగయ్య తన్మయుడయ్యే వాడని ప్రసిద్ధి కనుకనే

"దురితము లెల్లను పరిమార్చెడి హరి గుణము లు
పాడుచుచె వుండున్ పరవశమై వెలయు
పురందరదాసుని మహిమములను దలచెదను మదిలోన్"

త్యాగయ్య కీర్తించాడు. అలాగే వాలాజపేట వెంకటరమణ భాగవతార్

"రామబ్రహ్మ సుపుత్రాయ రామనామ సుఖాత్మనే
రామచంద్ర స్వరూపాయ త్యాగరాజయ మంగళమ్"

అని మంగళాష్టకంతో కీర్తించాడు తూము నరసింహదాసు

రామపదభక్తి త్యాగయార్య వరునికి
సమముగానేర రెవ్వరీ క్ష్మాతలమున
ప్రేమ నా ఘను డొకసారి పిలిచెనేని
రాము డోహో యనుచును మార్పులుకు నంట

అని చెప్పడం గుర్తించదగ్గది.

పురందరదాసు, త్యాగయ్య లిద్దరు ప్రసిద్ధ వాగ్గేయకారులు, శతాబ్దాలు గడచినా సర్వదా స్మరణీయులు.

# పురందరదాసు పదాలలో సమాజం

మనం బతకడం ఎందుకు - ఎవరి కోసం అని మనలో మనం చాలసార్లు అనుకుంటాం. అయిన వారితో ఆవేదన ప్రకటించుకుంటాం. వీటికి రెండు కారణాలు. మొదటిది నైరాస్యం - రెండవది జిజ్ఞాస. అలాగే సాహిత్యం ఎందుకోసం - ఎవరికోసం అనే ప్రశ్నలు తరచూ వింటున్నాం. దీనికి కారణం లౌకిక జీవితానికే ప్రాధాన్యత పెరిగి పోవడం ఒక కారణమయితే పండితులకూ పామరులకూ మధ్య అగాధం పెరగడం మరొక కారణం సాహిత్య స్రష్టకూ శ్రోతకూ ఎడం పెరిగి పోవడం కూడా ఇంకొక కారణం. ఈ విభేదాలు రావడానికి హేతువు లున్నాయి మొదటిది కవులు కొలువుకూటాలకు పరిమితం కావడం. ఆశ్రమమిచ్చే వారిని కీర్తిస్తే అదే చాలనుకునే వారిసంఖ్య అమితంగా పెరగడం. అయినా పామరుల్ని పట్టించుకునే వారు లేరా? ఉన్నారు వారే జానపదకవులు. వాగ్గేయకారులు. వారు ప్రజల మధ్య సామాన్య ప్రజల్లాగా జీవించారు. ప్రజల కోసం పరితపించారు. అంచేత వారి రచనల్లో ఆనాటి సమాజం ప్రతిఫలించింది. జీవించింది. శాశ్వతస్థానం నిలుపుకుంది.

వాగ్గేయకారుడనే మాటలో రెండు పదాంశాలున్నాయి. వాక్కారుడు, గేయకారుడు. వ్రాయడం, పాడడం, అనే రెండు ధర్మాలు ఒకరిలో ఉండడం వాగ్గేయకారుని ప్రత్యేకత. దీనినే మాతువు,ధాతువు అని సంగీత భాషలో అంటారు. వాగ్గేయకారులు ప్రతి భాషలోనూ ఉన్నారు. వారు రెండు రకాలవారు పండితులయిన వాగ్గేయకారులు పండితులు కాని వాగ్గేయకారులు. కన్నడ హరిదాస సాహిత్యంలో వ్యాసరాయలు, శ్రీపాదరాయలు మొదటి వర్గానికి చెందిన వారయితే

పురందరదాసు, కనకదాసులు రెండవకోవకు చెందినవారు. అలాటే వీరిలో పాండిత్యంలేదని కాదు. పాండిత్య ప్రదర్శనకు తమ రచనల్ని వాడుకోలేదని అభిప్రాయం. మత ప్రచారానికి ఈ రెండవ తరగతి వారే సమర్థులు. పార్టీ పటిష్టత కార్యకర్తల మీద ఆధారపడ్డట్టు మత ప్రచారం వీరి మీదే ఆధారపడుతుంది.

సమాజంలో "ఔపదేశికుడు" బయలుదేరితే వారి ఆరా తీయడం కొందరి నైజం. ఆ నిగ్గులో నిలబడ గలిగితే అతడు చెప్పింది యావత్తూ శిరోధార్యం. అతని పట్ల గురుత్వం భక్తి పడుగుపేకల్లా కలిసి పోతాయి. అన్నిట్లోనూ అతణ్ణి అనుసరించాలనే ధ్యాస పెరుగుతుంది. పురందరదాసుకు ఆ లక్షణాలన్నీ ఉన్నాయి. ఉన్న ఆస్తిని తన వారికి పంచినవారు కనిపిస్తారుగాని యావదాస్తిని దానధర్మాలకు వినియోగించిన నవ కోటి నారాయణులు అరుదుగా మనకు కనిపిస్తారు. ఆ అర్హత పురందరదాసుల వారికే దక్కింది. నలుగురు కొడుకులతో హరిదాస దీక్ష స్వీకరించడం, విజయనగర వీధుల్లో ఉంఛ వృత్తితో నిష్కళంకమయిన జీవితం గడపడం ఆ వాగ్గేయకారునికే చెల్లు. అం చేతనే పురందరదాసుల వారిని వ్యాసరాయల వారు "దాస రెందరె పురందరదాసరయ్యా" దాసులంటె పురందరదాసులే అని నోరారా కీర్తించారు. త్యాగరాజస్వామి అంతటివాడు

దురిత వ్రాతము లెల్లను
పరిమార్చెడి హరి గుణములు పాడుచు నెపుడున్
పరవశుడై వెలయు పురం
దర దాసుని మహిమములను దలచెద మదిలోన్

అని నమస్కరించాడు.

ఆంధ్ర వాగ్గేయకారులలో అన్నమయ్య సారంగపాణి మొదలయిన వారు గ్రామీణులలో కలిసిమెలిసి తిరిగిన ప్రసిద్ధులు. వారి సాహిత్యంలో గ్రామీణుల చిత్త వృత్తులు వారి వేషభాషలు, వారి ఆలోచనా సరళి కనిపిస్తాయి. భాషలో, భావంలో, వ్యక్తీకరణంలో ప్రజలకు దగ్గరి వాడయిన వాడు పురందరదాసు. తాను సమాజం కోసం పాడుతున్నానని దాసులవారే స్వయంగా చెప్పారు కూడా.

పాడువె నిన్నయ లీలెయ గుణగళ
కాడువె బేడులె నాడుళగె

"నాడు" అనే మాట ప్రదేశాన్ని సూచిస్తుంది. నీ లీలల్ని, గుణాల్ని పాడుతాను " అన్నది దాసుల వారి ప్రతిజ్ఞ.

సమాజాన్ని చిత్రీకరించడంలో దాసులవారు అనేక రకాలయిన పద్ధతుల్ని పాటించారు. మొదటిది సార్వత్రికమయిన విషయాన్ని సంగ్రహంగా ప్రదర్శించడం. కేవలం ప్రదర్శించడం మాత్రం కాదు. "భరోసా'' చెప్పడం. "సత్యవంతరగిదు కాల వల్ల" సత్యశీలురకు ఇది కాలం కాదు. అన్నమాట సార్వత్రికం. వెంటనే "అంజకె యాతక్కయ్య సజ్జనరిగె" అనడం. సజ్జనులకు, సత్పురుషులకు భయమెందుకయ్యా అని ఆశ్వాసించడం భరోసా.

సమాజమన్నది అనేక కుటుంబాల సమూహం. కుటుంబాలు అనేక రకాలు చిన్న కుటుంబం - పెద్ద కుటుంబం అని వర్గీకరణ. పరిమిత కుటుంబం. ఉమ్మడి కుటుంబం అని మరో విశ్లేషణ. ఇవన్నీ సంఖ్య బట్టి రక్తసంబంధం బట్టి ఉండడం. ఇవేగాక కళాకుటుంబం, రాజకీయ కుటుంబం, వ్యాపార కుటుంబం లాంటివి ఉన్నాయి. పురందరదాసు సమాజంలో తిరుగుతూ ఎన్నో కుటుంబాలను చూశారు.

కేవలం ఆధ్యాత్మిక బాధతో వాటిని సరిదిద్ద లేదు. వారి బాధను తన బాధగా గుర్తించారు. అవసరమయిన కళ పెద్ద వానిగా నయానా, భయాన చెప్పారు. కుటుంబం బాగయితే సమాజం బాగయినట్టు అని అతని అభిప్రాయం.

కుటుంబంలో భార్యాభర్తలు ప్రధాన వ్యక్తులు ముక్తి కోసం అడవులకు వెళ్ళాలి. అన్నీ వదలి పెట్టాలనే అపోహను తొలగించ డానికే కుటుంబ ప్రాధాన్యం దాసుల వారు నొక్కి చెప్పారు

సంసార వెంబంధ భాగ్య విరలి

కంసారి నెనవెంబ సౌభాగ్య విరలి అన్నారు.

"సంసారమనే భాగ్యముండనీ, కంసారి స్మరణమనే సౌభాగ్యముండనీ" అని భావం. ఈ భావాన్ని అన్నమయ్య కూడా

"సంసారమే మేలు సకల జనులకును

కంసాంతరుని భక్తి కలిగితే చాలు" అని చెప్పాడు.

త్యాగరాజస్వాముల వారయితే ఎదుటివాడు నోరు విప్పనవసరం లేకుండా

పలాయనవాదం దాసులవారికి సుతరామూ ఇష్టం లేదు. హరి దాసులలో చాలమంది సంసారులు నిశ్చింతావరులు. ఇంటి చింత ఇల్లాండ్రకుంటే "లోకచింత" వీరికి పట్టింది. ఏకవాధుడు కూడా ఈ లాంటి వాడే

"స్వామీ" అనుకూలవతి అయిన భార్యను కట్టబెట్టి ఎంతో ఉప కారం చేశావు. నీ మీదనే ధ్యాస పెరిగేలా చేశావు. అని కృతజ్ఞతలు ప్రకటించుకున్నాడు. పురందరదాసులవారు సంసారం సాగిస్తూ భగవన్నామ స్మరణ చేయమన్నాడు. "కృష్ణా ఎనబారదె" కృష్ణా అనరాదా, అనే కీర్తన ఈ భావానికి సరియయిన ఉదాహరణ.

కన్నకొడుకు ముద్దూ ముచ్చటలకు మురిసిపోతూ గట్టిగా కౌగ లించుకొని కృష్ణా అనరాదా. అనేది ఒక చిత్రణ అయితే మంద గామిని మాటల్లో మెత్తదనం మనసులో గొప్పతనం నిలుపుకున్న భార్యతో సరస ప్రసంగాలు చేస్తూ కృష్ణా అనరాదా అనడం మరొక చిత్రణ. ఈ కీర్తన పాడని వాగ్గేయకారుడు లేడు.

కుటుంబంలోని సామూహిక అంశాన్ని చెప్పిన తరువాత కుటుం బంలోని వ్యక్తుల లోపాల్ని ఏకరువు పెడుతూ సరిదిద్దడం దాసుల వారి ప్రత్యేకత.

ఇంటికి ప్రాణం ఇల్లాలు ఇల్లాంఁడు అనేక రకాలు. మొగుణ్ణి కొట్టి మొగసాలకు ఎక్కేవారు కొందరు. గయ్యాళితనం ప్రకటిస్తూ శాంతి లేకుండా చేసేవారు కొందరు అలాంటి వారిని కూడా దాసుల వారు కీర్తనల్లో ప్రత్యక్షం చేశారు.

హెండతి ప్రాణ హిండుతి దొడ్డ
కొండ కోతి యంతె కుణికుణి స్తుతి

పెళ్ళామా! ప్రాణం పిండేస్తున్నావ్ (తోడేస్తున్నావ్) పెద్ద కొండ కోతిలాగా కుప్పిగంతులు వేస్తున్నావ్ అని భావం.

కొందరు వ్రతాలకు ప్రాధాన్యమిస్తారు. గౌరి వ్రతం చేస్తారు. డాంబికంగా నోములు నోస్తారు కాని కట్టుకున్న వారిని పట్టించుకోరు. అలాంటి వారిని ఉద్దేశించి

"పతిగళ నిందవ సతియరు బహువిధ
వ్రతగళ మాడిదరేను ఫల" అని అన్నారు.

కట్టుకున్నవారిని నిందిస్తూ సతులు అనేక వ్రతాలు ఆచరించడం వల్ల ఫలితమేమిటి అన్నది దాసులవారి సూటి ప్రశ్న, ఇంకా కొందరు "అనుచిత సంబంధం"తో బతికేవారు. వారిని కూడా దాసుల వారు వదలిపెట్టలేదు

గండన్న తా బిడుతిహళు పర

తనమగవాణ్ణి వదలిపెట్టి మిండగాండ్రతో కులుకుతుందని భావం. అలాగే మగవారిలో కూడా ఉన్న పరస్త్రీవ్యామోహాన్ని దాసులవాడు "ఎండగట్టారు"

ఉత్తమ స్త్రీ యళ బిట్టు తన్న
వృత్తి గళెల్లవ సూళిగె కొట్టు

ఉత్తమ స్త్రీ అయిన భార్యను వదలి తన స్వార్జిత సంపద నంతా వేశ్యల కిచ్చి" అని భావం.

పురందరదాసులవారు పాటలు పాడుతూ తిరుగుతుంటే వారి దృష్టికి ఎన్నోకుటుంబాలు కనిపించేవి. వారితో కొందరికి అనుబంధం ఉండేదేమో. అలాంటి కుటుంబాలలో "అశాంతి" కనిపిస్తే తనకేమంటూ కదలిపోవడం వారి పద్ధతి కాదు. వారిని సరిదిద్దడం తన బాధ్యతగా తలపోసేవారు. అలాంటి "నేపథ్యం" ఉన్న కీర్తనలు ఎన్నో ఉన్నాయి.

అదొక కుటుంబం. ఆ కుటుంబంలో అలూ మగలూ ఉన్నారు. ఒక అమ్మాయి తన వానితో తగవు పెట్టుకుంది. ఆ తగవుకు తగిన

కారణం కూడా లేదు. అయినా "తగవు" పెరిగింది మాటా మాటా పెరిగాయి. ఇంకేం ముందూవెనుక ఆలోచించకుండా అమ్మాయి పుట్టిల్లు చేరుకుంది. అమ్మాయి వచ్చినందుకు తల్లిదండ్రులు సంబర పడ్డారు. అల్లుడు రాలేదేమని అడిగే ధైర్యం లేక కొంతకాలం ఊర కున్నారు. భర్త వస్తాడులే అనుకుంది భార్య కూతురు మరెక్కడికి వెళుతుందిలే అంటూ సద్దిచెప్పుకున్నారు తల్లిదండ్రులు. అమ్మాయి వెడుతుందిలే అని ఆశ పడ్డారు కొంతకాలం కాని అదేం జరగలేదు దాసులవారు ఆ పల్లెకు విచ్చేశారు ఎవరూ చెప్పకపోయినా అంతా అర్థం చేసుకున్నారు. అంచేత ఆ అమ్మాయికి నాలుగు మాటలు చెప్పారు.

"మంచి మాటలు చెబితే వినవమ్మ కూతురా! మనసు
మంచి చేసుకుని మగవానితో కాపురం చేయివమ్మా
ఇచ్చి పుచ్చుకోవడం బంధువుల్లో సహజం. అలాంటి
బంధువులతో ద్వేషం పెంచుకో వద్దు
ఇరుగు పొరుగు వారికి తగుదునమ్మా అంటూ న్యాయం
చెప్పవద్దమ్మా. అహంకారాన్ని, కోపాన్ని, మాత్సర్యాన్ని
ప్రకటించుకోవద్దమ్మా.

పొరుగువాదిని అకారణంగా నిందించే ఆడవారితో అసలు
చేరవద్దమ్మా. పురందర విఠలుని స్మరించడం మరచి
పోవద్దమ్మా.

ఈ కీర్తన ఒక కుటుంబానిది కాదు. ఇంటింటి కథ. ఇంత చక్కగా హితబోధ చేసిన హరిదాసు లెవ్వరూ లేరు.

ఈలాంటి మరొక దృశ్యం చూద్దాం. ఒక ఇంట్లో ఆలుమగలు జంట. ఇద్దరు అందగాళ్ళే. బాగా చదువుకున్న వారే. అమ్మాయికి అన్నీ వున్నాయి ఏవో విష ఘడియల వల్ల వైమనస్యం వచ్చింది. అంతే ఒక ఇంట్లో ఉన్నా "ఎడమొఖం, పెడమొఖం" పట్టారు. కాలం గడచి పోతూ ఉంది ముసలితనం ముంచుకు వచ్చింది. ఎందరో సర్ది చెప్పడానికి ప్రయత్నించారు. ఆవిడదే తప్పన్నాడు మగవాడు తనది కాదని తల తిప్పింది మగువ. రోజులు గడచినా రాజీ లేదు. ఆలాంటి దంపతుల్ని చూశాడు పురందరదాసుల వారు

"ఏను బందెయో జీవవె వ్యర్థవాగె

సతి పురుషరాగి సంతోషదిందిరలిల్ల

ఓ జీవా! ఎందుకు వచ్చావో నీ జీవితం వ్యర్థం సుమా! మీరు ఆలూ మగలే. అయితేనేం ఏనాడు సంతోషంతో గడపలేదు.

మృతి కాల బందు దిన వ్యర్థ హోయితల్ల

మరణకాలం రానేవచ్చింది రోజులు వృథాగా గడచిపోయాయి

దానవ మాడ లిల్ల ధర్మవ మాడలిల్ల

దానాదులు

చేయలేదు. ధర్మకార్యాలు చేయలేదు. దాక్షిణ్యం సుతరామూ లేకపోయింది. దైన్యం పరిహరించే మాటలు కరువయ్యాయి.

స్త్రీల పట్ల దాసులవారికున్న సానుభూతి చాలా ఎక్కువ. గురజాడ కన్యాశుల్కంలో బుచ్చమ్మ పట్ల సామభూతి ప్రకటించినట్టుగా దాసులవారు విధవల పట్ల సానుభూతి ప్రకటించారు.

రమణ నిల్లద నారి పరర కణ్ణిగె మారి

రమణుడు లేని నాగిమణి ఇతరుల కళ్ళకు మారిలాంటిదట. వారికున్న

రూపం, వారి యౌవనం, వారి సిరిసంపదలు, సేవా చాతుర్యం అంతా వ్యర్థమే.

> ఉపకార మాడిదరె గతియు నీ నెంబువరు
> అతిశ్రమ పట్టరూ ఆదరిసరు
> విపరీత హణవిద్దరె అపహరిసి తింబువరు
> చాకిరియ మాడిదరె ఆచీచె లాడువరు

ఉపకారం చేస్తే నీవే గతి అంటారట. ఎంత శ్రమపడ్డా ఆదరించరు. దండిగా డబ్బుంటే లాక్కుంటారట. చాకిరి చేస్తే చేయించుకుని ఆపై "ఏకసక్కె" మాడతారట.

దాసులవారి పదాలలో సన్యాసులు, వైద్యులు, రకరకాలయిన వ్యాపారం చేసేవారు కనిపిస్తారు. "నిండు మనంబు నవ్యనవనీత సమానము పల్కు దారుణాఖండల శస్త్రతుల్యము" అనేమాట దాసుల వారికి బాగా అతుకుతుంది. అవసరమయితే అందరిని విమర్శించ డానికి ఆయన జంక లేదు.

> కావియ నుట్టు తిరుగువిరల్ల కామవ బిడలిల్ల

కాషాయం కట్టుకుని తిరుగుతారు గాని కామాన్ని వదలిపెట్టలేదు.

> సొల్లిగె శరణర కథెగళ పేళుత
> అల్లద నుడియను నుడియువిరల్ల

మాట మాటకు ఉదాహరించడం శరణుల కథలు. అయితే పలికే వేమో కాని మాటలు.

అలాగే పురందరదాసుల వారు "భ్రష్టరాదరు మనుజరు" అనే కీర్తనలో రకరకాలయిన భ్రష్టుల్ని జోడించారు.

కడన కొట్టవ రొడనె ధడి తన మాడువ భ్రష్ట

బడవరిగె కొట్టనుడి నడెసదవ భ్రష్ట

అవసరానికి అప్పుఅడిగి, అప్పుపుచ్చుకున్న తరువాత, అప్పు ఇచ్చిన వాడు అడిగితే దబాయించేవాడు భ్రష్టుడు. పేదవారికి వాగ్దానం చేసి మాట నిలుపుకోనివాడు భ్రష్టుడు. ఈలానే రకరకాలయిన మూర్ఖుల్ని అందంగా చెప్పారు దాసుల వారు

నెంటరిగె సాలవను కొడువాత మూర్ఖ

బంధువులకు అప్పు ఇచ్చినవాడు, ఇచ్చువాడు మూర్ఖుడు.

బడతనవు బందాగ బైదుకొంబువ మూర్ఖ

పేదరికం వచ్చినపుడు తన్ను తాను నిందించుకొనే వాడు మూర్ఖుడు.

ముప్పినలి మదులె మాడి కొంబువను మూర్ఖ

ముసలితనంలో వివాహం చేసుకునేవాడు మూర్ఖుడు.

ఉండమనె గెరడన్ను బగె వాతనే మూర్ఖ

తిన్న ఇంటికి వాసాలు లెక్కపెట్టేవాడు మూర్ఖుడు.

కొండె మాతను కేళి కుణివమను మూర్ఖ

కొండెపు మాటలు విని కుప్పిగంతులు వేసేవాడు మూర్ఖుడు.

పురందరదాసుల వారి రచనల్లో కనిపించే మరొక్క విశేషం హేతువాద ధోరణి. ఈ వాదం ఈనాటిది కాదు. అనాటిది. అంచేతనే దాసులవారు కర్మ కాండల్ని, యాత్రల్ని నిందించారు. పితృ తర్ప ణం చేసేవారిని చూచి

"నువ్వుఅ దర్భలు వేత్తో వట్టుకుని పితృ తృప్తి"

అంటూ వదలితే చేపలు నువ్వుల్ని మింగాయి. దర్భలు నీళ్ళల్లో కొట్టుకుపోయింది. "చెప్పేవాడు అజ్ఞాని. వినేవాడు అవివేకి" అని హెచ్చరించాడు.

"అనుభవమే ఆసాన్" అని తమిళంలో సామెత. అనుభవం గడించిన వాడే ఆచార్యుడు పెద్దవాడు ఉత్తముడు. సమర్థుడు. అనుభవం వ్యక్తిని ఎదిగేలా చేస్తుంది దాసులవారి "దేవరనామగళు" లో అనుభవసారం అడుగడుగునా కనిపిస్తుంది.

కెట్ట నెంటర సేరువుదు బహు కఠిన
చెడి బంధువుల పంచ చేరడం చాలా కష్టం.

సాల మాడ బేడ సాలదు ఎనబేడ
అప్పు చేయవద్దు. సరిపోవడం లేదని చెప్పవద్దు.

బిల్లాగి ఇరబేకు బల్లవర ఎదురు
బలవంతుల ముందు ఎక్కుపెట్టిన ధనుస్సులా ఉండాలి.

బళ్ళె జనగళ నిందెయను నీను మాడబేడ

బళ్ళెయవ నెందరె హిగ్గబేడ

మంచివాళ్ళను ఎపుడూ నిందించవద్దు. మంచివాడవు నీవనీ అంటే పొంగిపోవద్దు.

దొరతనవు బందాగ కెట్టు నుడియలు బేడ

సిరిబందకాలక్కె మెరెయ బేడ

అ...ం దాపురించిన కాలంలో వరుషోక్తుల వల...ద్దు.

## 119

అన్నమయ్య ప్రభావం పురందరదాసుల పదాలలో కనిపించి నట్లే పురందరదాసుల వారి ప్రభావం త్యాగరాజస్వామి రచనలలో కనిపిస్తుంది. భక్తికి మత భేదం లేదు. భక్తులకు స్వపర భేదం లేదు. వారిది నిస్వార్థమయిన త్యాగ జీవితం మనసా వాచా కర్మణా వారు ఆదర్శం పాటించిన వారు. వారి నడవడి మన కందరికి ఒరవడి.



# రామాయణంలో వ్యవసాయానికి సంబంధించిన
# — విశేషాలు —

ప్రపంచంలోని భాషలలో సంస్కృతం ప్రాచీనమయిన భాష ఈ భాషలో వ్రాయబడ్డ తొలి కావ్యం రామాయణం. ఈ రామాయణాన్ని ఇతిహాసం అనికూడా చెబుతారు ఇతిహా ఆసీత్ అని అర్థం అంటే ఈలాగా ఉండేది అని భావం. అంచేత రామాయణం కల్పితకథ కాదు. జరిగిన కథ. కాకపోతే కొన్ని కల్పనలు చేరి ఉండవచ్చు. ఆలంకారికులు వేదాలను ప్రభుసమ్మితాలు అని అంటారు. ప్రభువులాగా శాసించడం వేదాల నైజం పురాణాలు మిత్రసమ్మితాలు. మిత్రునిలాగా సలహా లివ్వడం పురాణాల స్వభావం. కావ్యాలు కాంతా సమ్మితాలు కాంతలలాగా ఆకర్షించడం కావ్యాల స్వరూపం. ప్రాచీన కవులు సత్యాన్ని ప్రతీకలుగా నిలుపుతూ కథ అల్లుతూ ఎన్నో విషయాలు చెప్పారు. అదీగాక కావ్యమన్నది అనేక కళల కాణాచి లౌకిక విషయాలు అలౌకికాంశాల చేరిక కావ్యం. ఒక్క మాటలో చెప్పాలంటే యాత్రాస్థలంలో స్థిరనివాసులు యాత్రికులు ఒకచోట చేరడమన్న మాట. అంతేగాక కవి సమాజంలో ఒక వ్యక్తి కావడం వల్ల సామాజికాంశాలను కూడా ప్రత్యక్ష పరోక్షరూపంలో చెప్పడం తప్పు కాదు. ఈ దృష్టితో పరిశీలిస్తే రామాయణంలో అనేక సామాజికాంశాలు కనబడతాయి. వాటిలో వ్యవసాయానికి సంబంధించిన విషయాలు చాల ఆకర్షణీయంగా కనిపిస్తాయి.

పేరుకు రామాయణ మయినా "సీతాయాశ్చరితం మహత్" అన్నారు. సీత చరిత్ర వల్లనే ఆ గ్రంధానికి ప్రత్యేకత. సీత దైవాంశ సంభూతురాలు. మహాలక్ష్మి అంశావతారం మొదలయిన

అంగాలను పక్కకు పెడితే సీత భూపుత్రి అవడం మాత్రం సత్యం. జనకమహారాజు నాగేటిచాలుతో దున్నుతూ ఉండగా సీత దొరికిందవడం వాస్తవం. ఇందులో ఎన్నో అంతరార్థాలున్నాయి.

ఋగ్వేదంలో సీతను వైదిక దేవతగా కీర్తించారు సీత కర్షక దేవత.

"శుభదాయిని అయిన సీతా సన్నిహితవు కమ్ము. మాకు శుభమ్ కూర్చ నిన్ను స్తోత్రం చేస్తున్నాం. మాకు పుష్కలంగా పంటలు ప్రసాదించు" అని స్తోత్రం యజుర్వేదంలో సీతకు సంబంధించి 4 స్తోత్రాలున్నాయి. యజ్ఞం కోసం నేల దున్నే వేళ వీటిని చదువు తారు. గృహ్యసూత్రాలలో కూడా "సీత" అనేమాట ఉంది. రామా యణ కాలానికి ముందు వ్యవసాయానికి అంతగా ప్రాధాన్యంలేదు. పండించిన పంటకన్నా పండిన పంటలే వారికి సర్వస్వం దట్టమయిన అడవులు. అడవుల నిండా ఫల వృక్షాలు, జనసాంద్రత లేక పోవడం వల్ల వ్యవసాయం చేసుకోవలసిన అవసరం లేకపోయింది. కాని నాగ రికత పెరిగే కొద్దీ స్థిరనివాస అభిలాషబలపడే కొద్దీ "భూమి" అవసరం ఏర్పడింది. వామనుడు బలిని మూడు అడుగులదానం అడగడంలో అలౌకికార్థం ఉంటే ఉండవచ్చు గాని వ్యవసాయానికో లేదా తనకంటూ స్థిరనివాసానికి కొంత స్థలం సంపాదించుకునే ప్రయత్నం కనిపిస్తుంది పరశురాముని "గొడ్డలి" బలరాముని "నాగేలు" మొదలయిన వాటిని కూడా వ్యవసాయానికి అనుసంధానించుకోవచ్చు. ఈ ప్రయత్నమే జనకునికాలంలో కూడా జరిగింది. "సీత" అనేమాట "వరి"కి పర్యాయం వేదకాలంలో యవలు, గోధుమ లున్నాయి. "వరి" సాగు రామాయణ కాలంలో బాగా ప్రచారమయిందని చెప్పవచ్చు. ఈ ప్రయత్నం

మిథిలలో మొదలు కావడం విశేషం. ఇతరత్రా వ్యాపించడం అంత కంటె విశేషం. అహల్య "రాయిగా" పడి ఉందని ఐతిహ్యం. అంటే ఆ ప్రదేశం రాతినేల అని అభిప్రాయం. శ్రీరామచంద్రుడు యాగ రక్షణ తరువాత మిథిలకు వెళుతూ రాతినేల గుండా వెళ్ళాడనడం అతికిన సత్యం. సీతారాముల వివాహం లోక కళ్యాణాన్ని కలిగించిం దనడం అలౌకికం. అయితే రాముడు నీలమేఘశ్యాముడు అనడాన్ని కొంత విస్తరించి చెప్పాకుంటే సీత అనబడే వరి నీలమేఘశ్యాముడనే రాముని సంసర్గంతో బాగా పండిందనడం తప్పుకాదు. "వరి" నల్లటి నేలలో బాగా పండడం మనకు తెలిసిన విషయం. అదీగాక నదీ తీరాల్లో పుష్కలమయిన జలసంపద ఉన్న ప్రాంతంలో "వరి" బాగా పండుతుంది. సరయూ నదీతీరంలో "సీత" బాగా పండిందనడం వాస్తవం. అదీగాక తమిళంలో "వరి" అంటే తోట అని అర్థం. నదీ తీరాల్లో తోట లుండడం సహజం. కొబ్బరి తోపులు, చెరకు తోటలుం టాయి. ఈ తోపుల్లో, తోటల్లో "వరిని" కూడా పండించడం మనకు తెలిసిందే. అలాగే సీత మిథిలలో అయోధ్యలో రాణించిందనడం సబబు. ఈ రోజుల్లో "Farms" అని వాడతాం. Farmsలో రక రకాలయిన పంగడాల్ని పండించడం కాపాడడం కూడా కద్దు. అదే రకంగా రావణుడు "అశోకవనం" అనే Farming లో సీతను దాచా డని వివరించడంలో తప్పేమీ లేదు. సీతకు వరికి ఇంత ప్రాధాన్యం ఉండడం వల్లనే సాధారణమయిన పెళ్ళిల్లో కూడా "అక్షతలు" కు ప్రాధాన్యం ఏర్పడింది. లగ్న పత్రికలలో కనిపించే "జానక్యాః కమలాంజలి పుట" అనే శ్లోకంలో కూడా వరితో చేయబడ్డ "లాభాలు-పేలాల ప్రస్తావన ఉంది. సీతాభోగములు, రామభోగములు అనే ధాన్య విశేషాలున్నాయి సీతాఫలం, రామాఫలం అని ఉన్నట్టు.

సాధారణంగా ఇంట్లో వస్తువులు నిండుకున్నా, సమయం చాల పున్నా "పులిహోర" కలవడం మనకు తెలిసిందే. బాగా విడిగిన బియ్యం, చింతపండు రసం ఇంకా కారం కోసం మిర్చి మొదలయిన వాటిని జత చెయ్యడం పులిహోర లక్షణం దీనిని ఔత్తరాహులు "రావణ్‌భాత్" అని అంటారు. వ్రత భోజనానికి, మంత్రాక్షతలకు శుభశోభన విషయాలకు, దేవునికి, నిత్యనైవేద్యానికి, శిశువులకు, బంధువులకు, బ్రాహ్మణ సమారాధనకు, విద్యారంభానికి "వరి" చాలా ముఖ్యం. ఫాలభాగంలో ధరించే గంధాక్షతలకు కూడా "వరి"ని ఉపయోగిస్తారు. దర్భలు లేకపోతే వరి వెన్నులు వాడడం తప్పుకాదు,

రామాయణంలో వరికి సంబంధించి గడ్డికి సంబంధించి ఎన్నో అంశాలు కనిపిస్తాయి, కాకాసురుని వృత్తాంతంలో "గడ్డి" ప్రస్తావన ఉంది. గడ్డిని మంత్రించి వేస్తే అదే బ్రహ్మాస్త్రమయిందట. పంట లను పాడుచేసేవి పక్షులు క్రిమికీటకాదులు. అలాగే "సీత" అనే వరిని బాధించడానికి అశోకవనంలో సీతను చూడడానికి వచ్చినపుడు తన ఆటోపాన్ని ప్రదర్శించినపుడు సీత గడ్డి చేతపట్టి మాటలాడిందట. ఇప్పటికి బిచ్చగాళ్ళు "అమ్మా కాస్త గడ్డిగింజలు పడవేయుమ్మా" అనడం తెలిసిందే.

హనుమంతుడు లంకలో సీతకోసం తెగ తిరిగాడు. అక్కడ హనుమంతుడు దర్శించిన ప్రదేశాలన్నీ వనాలే. "శాద్వలానిచ నీలాని గంధవంతి వనాని చ" అని వాల్మీకి అభివర్ణించాడు. అనేక రకాలయిన మాంసాలను చూచాడు. పారుతున్న నీటిని అడ్డుకడితే కాలువల్లో ప్రవహించడం అశోకవనంలో చూచాడు. ఆ అశోకవనం లోనే సీత కూడా ఉంది. ఇవన్నీ Irrigation Farming ను తలపిస్తాయి. లంకలోని వనాలు ఉపవనాలు చూడడానికి వచ్చాను.

వనాని ఉపవనానీహ ప్రదష్టుమాగమనంహిమే అని చెప్పడం పై వాదానికి బలమిస్తుంది కూడా.

కన్నడంలో కనకదాసుడు ప్రసిద్ధ వాగ్గేయకారుడు. అతడు వ్రాసిన కావ్యాలలో "రామధాన్య చరితే" చాలా విశిష్టమయింది. కన్నడ దేశంలో "రాగి" పంట ఎక్కువ. కన్నడగులు చాలామంది "రాగిని" ప్రధానఆహారంగా సేవిస్తారు. రావణవధానంతరం రాముడు ఒక తాపసి ఆశ్రమానికి వెళ్ళాడట. తాపసి "రాగితో" చేసిన ఆహారం సమర్పించింది. ఆ ఆహారం రుచిగా ఉంది. ఆ సందర్భంలోనే ఏ ఆహారం "రుచికరం" అనే చర్చ ఆసక్తికరంగా సాగింది. ధాన్య విశేషాలే పాత్రలుగా వాదించుకోవడం మొదలెట్టారు. వరి చేసిన వాదం ఇతరులకు నచ్చలేదు. ఈ వాదం తీర్చడానికి దేవతలు వచ్చారు. ఇంద్రాదులు "వరిడిలగ" అనే ధాన్యాన్ని సమర్థించారు. ఆ తీర్పుకు రాముడు సమర్థించాడు. ఆ ధాన్యాన్ని "రాఘవ" అని పిలిచి గౌరవించాడట. రాఘవ శబ్దం యొక్క తద్భవ రూపం "రాగి" ఈ కథ నిజమో కాదో తెలియదు కాని వేదకాలం నాటి ఆర్యులు రాగి మొలకనుండి సోమపానం తయారుచేసే వారనడంలో ఏ సందేహమూ లేదు. "వరి" క్రమంగా కన్నడ ప్రాంతానికి కూడా ప్రాకిందనడం అతికిన సత్యం.

ప్రపంచంలో అనేక భాషలలో రామాయణాలు ఉన్నాయి. అయితే కథ అన్నిట్లోను సమానంగా లేదు. ప్రత్యేకించి సీత ఎవరికి ఏమవుతుందనడం. కొందరు రావణుని కూతురంటారు. శంకర రామాయణంలో ఈ కథ వుంది. జ్యోతిష్కుల సలహా మేరకు రావణుడు మిథిలలో భూమిలో ఉంచాడట. క్షామ సమయంలో పొలాలుదున్నుతూ

ఉంటే జనకునికి దొరికిందట. అలాగే తారాచంద్ రామాయణంలో ఋషులు కుండెడు నెత్తురు బహూకరిస్తే దానిని మిథిలలో దాచాడట. అమర రామాయణంలో తనకు ఋషులు ప్రసాదించిన భాండాన్ని మండోదరికి ఇచ్చాడు. మండోదరి గర్భం ధరించిదని, రావణు గర్భ స్రావం చేయించాడని పిండాన్ని కుండలో ఉంచి జనకపురిలో పాతి పెట్టించాడని ఉంది. ఈ కథలో సత్యం ఉందని అనుకుంటే రావణుడు వరి వంగడాన్ని కనుక్కొన్నాడని ఆ వరిని కుండల్లో ఉంచి రక్షణ చేశాడని మిథిల ప్రాంతంలో వరిసాగుకు ప్రయత్నించాడని అనవలసి వస్తుంది. ఉత్తర భారతంలో "గోధుమలనే" వ్యాప్తి దక్షిణంలో శ్రీలంకలో "వరి"కే స్థానం గోదుమలలో కంటె వరిలో కార్బొహైడ్రేట్స్ ఎక్కువ అంటారు. శక్తికి యుక్తికి ఇవి అవసరం కృతయుగంలో "వరి" ఉందో లేదో తెలియదుగాని త్రేతాయుగం నుండి వరి వ్యాప్తిలో ఉన్నదనడం వాస్తవం.

రామాయణం కేవలం కథ కాదు. అనేక ధర్మ రహస్యాలకు పేటిక. త్రేతాయుగం నాటి సాంఘిక జీవనానికి దర్పణం.



# తిరుమలలో 'చక్రస్నానం'

"నిత్య కళ్యాణం పచ్చతోరణం" అనేమాట తిరుమలలో సార్థకం. నిత్యోత్సవాలు, పక్షోత్సవాలు, వారోత్సవాలు. సంవత్సరోత్సవాలు కొండమీద సక్రమంగా జరుగుతుంటాయి కలియుగ వైకుంఠమయిన తిరుమలలో జరిగే ఉత్సవాలలో "బ్రహ్మోత్సవం" చాలా విశిష్ట మయింది. "అధికమాసం" వచ్చిన సంవత్సరంలో రెండు బ్రహ్మో త్సవాలు జరుగుతాయి. రకరకాలయిన వాహనాల మీద "ఉత్సవ మూర్తి" భక్తులకు దర్శన మివ్వడం రమణీయ దృశ్యం. బ్రహ్మో త్సవాలలో చివరిరోజు "చక్రస్నానం". వరాహస్వామి ఆలయం ఎదు రుగా ఉన్న స్వామి పుష్కరిణిలో "సుదర్శన చక్రం" స్నానం చేయడం ఒక పర్వదినం. ఈ చక్రస్నానానికి "తీర్థవారి" అనిపేరు. ఇక్కడ "తీర్థం" అనేమాటకు "పుణ్యం" అని అర్థం. బ్రహ్మోత్సవ కాలంలో స్వామి పుష్కరిణిలో స్నానంచేసినా చేయకపోయినా ఈరోజు చేస్తే తక్కిన దినాల పుణ్యం కూడా వస్తుందని భావన. శ్రీవేంకటేశ్వ రునికి తిరుమలమీద ఉండడానికి వరాహస్వామి అంగీకారం తెలపడం వల్ల వరాహస్వామి ఆలయం ఎదురుగా ఉన్న స్వామి పుష్కరిణిలో ఈ మహోత్సవం జరగడం విశేషం

మహావిష్ణువు పంచాయుధాలలో "చక్రం" ఒకటి. అర్జునుడు కృష్ణభగవానుని దర్శించి

"కిరీటినం గదినం చక్ర హస్తం
ఇచ్ఛామి త్వాం ద్రష్టు మహం తథైవ
తెనైవ రూపేణ చతుర్భుజేన
సహస్ర బాహు భవ విశ్వమూర్తే" అని ప్రార్థించాడు.

పంచాయుధ స్తోత్రంలో

> స్ఫురత్సహస్రార శిఖాతి తీవ్రం
> సుదర్శనం భాస్కర కోటి తుల్యం
> సురద్విషాం ప్రాణ వినాశి విష్ణోః
> చక్రం సదాహం శరణం ప్రపద్యే

అనే చక్ర స్తోత్రం కనిపిస్తుంది. అర్ధ భూషణ అధ్యాయంలో "చక్ర స్వరూపః చ మనోదత్తె విష్ణుః" అని ఉంది. అవసరమయిన వేళ ప్రయోగింపబడుతూ మరల విష్ణువును చేరుకుంటుందని భావన. సంస్కృతంలో కూర నారాయణ ముని సుదర్శనాష్టకం, సుదర్శన శతకం వ్రాశాడు. మయూరుడు "స్రగ్ధర"లో సూర్యశతకం వ్రాసినట్లే కూర నారాయణుడు సుదర్శన శతకం వ్రాశాడు. తెలుగులో కూడా సుదర్శన చక్రన్ని స్తుతించిన కవు లెందరో ఉన్నారు. శ్రీకృష్ణ దేవరాయులు ఆముక్తమాల్యదలో "రాహుమస్తకము గొన్న సుదర్శన దేవు కొల్చెదన్" అని స్తుతించాడు. ఇందుమతీ పరిణయం, రుక్మిణీ కళ్యాణం, యతిరాజ విజయం, మహాలక్ష్మీ పరిణయంలో "సుదర్శన చక్ర స్తవం" ఉంది. ఆళ్వారులలో ఒకరయిన "తిరుమళిశై ఆళ్వారు" "సుదర్శన చక్ర అంశం" అని వైష్ణవులు విశ్వసిస్తారు. ఈ ఆళ్వారుకు భక్తిసారయోగి, చక్రాంశయోగి, తీర్థయోగి అనికూడా పేర్లు.

తాళ్లపాక కవులు "శ్రీచక్ర ఉపాసకులు" తాళ్లపాక చెన్న కేశవ స్వామి ఆలయం ముందు "సుదర్శన చక్రం" ఉంది. తిరుమల దేవాలయంలో పాతకళ్యాణమండపంలో హరిసుదర్శనావతారమయిన "కార్తవీర్యార్జునుని" భంగిమ కనిపిస్తుంది. తిరుపతిలో దేవస్థానం పరిపాలన కార్యాలయం పక్కన ఉన్న వరదరాజస్వామి దేవాల

యంలో "సుదర్శన" ఆలయం కూడా ఉంది. తమిళనాడులో కుంభ కోణంలో తిరుక్కుడందై, మధురై దగ్గర తిరుమోహూర్, కంచి వరద రాజస్వామి దేవాలయంలో అనంతసరస్సు దగ్గర "సుదర్శనుల" సన్నిధి ఉండడం గుర్తించదగిన అంశం. వైష్ణవులు సుదర్శన చక్రాన్ని "చక్రత్తాళ్వార్" అంటారు. దేవాలయంలోని ఐదు బేరాలతో "చక్రం" ఒకటి. బలి సమర్పించే వేళ చక్రత్తాళ్వార్ ఒక అధికారిగా ప్రవర్తించడం విశేషం. తాళ్లపాక కవులు

"మొక్కెద మిదిలో మూడు మూర్తులను
నొక్క రూపమై దొనరె చక్రము" అన్నారు. ఈ చక్రం "బ్రహ్మ విష్ణు శివాత్మకం" అని వారిఅభిప్రాయం అంతే కాదు. చక్రత్తాళ్వారు ఊరేగింపును తాళ్ళపాక కవులు

"వెడలె వెడలె నదె వీధుల వీధుల
తొడికి దైత్యులను త్రుంచగను" అని వర్ణించారు.

తాళ్ళపాక పెదతిరుమలాచార్యులు "సుదర్శనరగడ" వ్రాశారు. ఈ రగడ ఓంకారంతో మొదలయి వేంకటపతి నామంతో పూర్తి అవుతుంది.

"వేయంచులు గల విశ్వపు చక్రము
భావించు సుజన పాలన చక్రము
శ్రీవేంకటపతి చేతిది చక్రము"

మహా విష్ణువు చక్రాయుధంతో దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేసిన సందర్భాలెన్నో ఉన్నాయి. శిశుపాల వధ, నరకాసుర సంహారం, సాందీపని కుమారుని తేవడం కోసం వెళ్ళిన వేళ దట్టమయిన చీకటిని తొలగించిన సందర్భం, పౌండ్రక వధ, బాణాసుర వధ, కాశీపతి

ప్రయోగించిన కృత్య నిర్మూలన ఘట్టాలలో "చక్రాయుధ విహారం" కనిపిస్తుంది. అంతే కాదు ఇతర అవతారాలలోనూ "చక్రాయుధం" పరోక్షంగా ప్రయుక్తమని పెద్దలు చెబుతారు. వరాహావతారంలో "కోరదంతాలు"గా నరసింహావతారంలో "చేతి గోళ్ళుగా" పరశురామావతారంలో "గొడ్డలిగా", శ్రీరామావతారంలో "బాణంగా", త్రివిక్రమావతారంలో శుక్రుని అంధునిగా చేసిన సదంర్భంలో దర్భగా సుదర్శనాయుధం కీలకపాత్ర వహించిందని పెద్దలు వ్యాఖ్యానిస్తారు.

"సుదర్శనం" అంటే చాల "అందమయిందని" ఒక విశేషార్థం. సుజ్ఞానం ప్రసాదించడం వల్ల సుదర్శనం స్వామికి అందంగా ఉండడం వల్ల సుదర్శనం స్వామికి అలంకారప్రాయం సుదర్శన చక్రం

వైష్ణవుల పంచ సంస్కారాలలో చక్రాంకితం చేయడం ఒక అంశం. ఈ చక్రాంకితం వల్ల చేసుకున్నవారు విష్ణువుకు దగ్గరివారని అభిప్రాయం. మంచి మార్గాన్ని చూపేవాడు కావడం వల్ల సుదర్శనర్. పతివ్రతకు ఐదు లక్షణాలు ఏలాంటివో వైష్ణవుని "పంచ లక్షణాలు" కూడా అలాంటివే. భగవంతునికి ఐదు ఆయుధాలయితే సుదర్శనునికి 16 ఆయుధాలు ఆళ్వారుల పాశురాలలో "సుదర్శన స్తవం" చాలాచోట్ల కనిపిస్తుంది.

నెయ్ తలై నేమియుం సంగుం నిలవియ

- పెరియాళ్వార్

ఆఖి పోల్ మిన్ని - ఆండాళ్

మిన్‌వట్టచ్చుడరాళి వేంగడక్కోన్ తానమిళుం - కులశేఖర్

వెయ్య ఆళి సంగు తండు విల్లుం వాళుం - తిరుమళిశై పిరాన్

పెరుమాళ్ సంగుడైయోన్ - మణవాళమహామునులు
అరుళాల్ తిరుచ్చక్కరత్తాల్ - నమ్మాళ్వార్

ఇతర ఆలయాలలో "శంఖ చక్రాలు" అలంకార ప్రాయంగానే కనిపిస్తాయి. కాని తిరుమలలో శంఖ చక్రాలు చెవి వైపు వాలినట్లు కనిపిస్తాయి స్వామిని దర్శించడానికి విచ్చేసిన భక్తాదుల పరిచయాన్ని ఈ శంఖ చక్రాలు చేస్తున్నాయని పెద్దల విశ్వాసం.

త్రివిక్రమావతారంలో వామనుడు విజృంభించాడు. ఆ ఆకారానికి తగినట్లు శంఖ చక్రాలు కూడా ఉత్సాహంతో ఎగురుతున్నాయట. ఈ అభిప్రాయాన్నే "ఆళి ఎళ చ్చంగుం విల్లుం ఎళ" అని ఆళ్వారులు స్తుతించారు. ఆండాళ్ "వెయ్యదోర్ తళని ఉమిళ సక్కరక్కై" అన్నారు. ఈ చక్రం భక్తాదుల్ని రక్షించడమే కాదు స్వామికి కూడా రక్షకంగా కూడా ఉంది. అందువల్లనే "పెరియాళ్వార్" స్వామి "వల్లాండు" చెప్పారు. తిరుమలలో చక్రస్నానం రోజున "వల్లకి" సందర్భంలో "పెరుమాళ్ తిరుమొళ్లి" పాడతారు. చూర్ణాభిషేక సమయంలో తిరుచ్చన్ద విరుత్తం, తిరుప్పళ్ళి ఎళుచ్చి, అములనాది పిరాన్, కణ్ణిమన్ శిరుత్తాంబులు గానంచేస్తారు. చక్రస్నాన సమయంలో "తిరుత్తాండకం" పఠిస్తారు.

తిరుమలలో జరిగే "చక్రస్నానం"లాగే తిరుచానూరులో పద్మ సరోవరంలో అలమేలుమంగమ్మ బ్రహ్మోత్సవకాలం చివరి రోజున "చక్రస్నానం" జరుగుతుంది ఈ సందర్భంలో లక్షలాది జనం స్నానం చేయడం ఒక ఆచారం భక్తాదులు కోరికలు తీరడం కోసం ఈ చక్రస్నాన సమయంలో పవిత్ర స్నానం చేస్తారు.

**131**

"చక్రం" అనేమాటను "మామూలుగా" తీసుకున్నా భూచక్రం కాలచక్రం వంటివి మనకు గుర్తుకు వస్తాయి. అలాగే యోగశాస్త్రంలో దేహంలోని "చక్రాల" గురించి వివరణ కనిపిస్తుంది. శైవంలోను, శాక్తేయంలోనూ "చక్ర" పూజకు ప్రత్యేక ప్రాధాన్యముంది.



# A Note on "Tulaka Nachiyar" of Melkote

Now a days often we speak of integrety in our gatherings, stage meetings and in conversations. But this integrety is not a new one. We can identify this approach in literature and arts in olden days also For example there are several instances in the past which reveal the thought of unity among Hindus and Muslims Among them there is a story in which a daughter of Muslim king who married Hindu God. She is called as Tulakka Nachiyar in kannada and Beebi Nanchari in Telugu

In the literature of Telugu the story of Tulakka Nachiyar is framed in various literary forms particularly in Yakshaganas and in folk metres.

The first one is Ramanuja Vijayamu This was written by Katrambaka Kesavacharyulu This book was dedicated to Bhootha Pureeswara of Sriperumbudur of Madras State. This was published by Bhuvanagiri Rangayya Setty in 1860. The printers of the book is mainly the successful trip of Ramanujacharya to Delhi in getting back "Ramapriya" idol to Melkote of Karnataka.

The second one is Sultani Kalyanamu of Mudu-mbai Alamelmanga thayaramma She has praised kunti Madhava Swami of Pitapuram of Andhra Pradesh She was the disciple of Narasimha desika Her book was printed by Vani Mudraksharasala of Bezwada in 1917. The story reveals the marriage of Beebi, who was daughter o Delhi Sultan, with Chellapillaraya of Melkote, of Karnataka There is another Yakshagana in Telugu namely "Suratani Kalyanamu" The author of the book is not known This was dedicated to Achyuta Vijaya Ranga. The publishers of the book is Karra Acchayya and Sons of Rajahmundry, Andhra Pradesh This was publi-in Chintamani Printers of Rajahmundry in 1925 The story of the book also describes the marriage of Beebi Nanchari with Sri Ranganatha

The last one is Chellapillaraya Charitra. This was written by Tallapaka Annayya who belongs to famous poets of Tallapaka family He lived in 15th Century The story of the yakshagana is the marri-age of Beebi with Chellapillaraya of Melkote This book was recently edited and published by Sri A Prakasa Rao of Guntakal, Andhra Pradesh in 1982. Among the yakshaganas available this is the oldest one

The gist of the book - the scholers of Melkote decided to visit northern cities to prove their scholarship and get presentations from the rulers. They have visited the court of Delhi Sultan He wās a pious man. He has given wārm welcome to the scholars and enquired about the greatness of Melkote He has given number of valuable presentations to them The scholars returned to Melkote.

The chief preacher of Makka Maszid came to know the Sultan's warm welcome and presentations to the scholars of Melkote and he got angry He warned the Sultan and emphasised the faith of true muslims Sultan bowed his heād. Then the preacher has ordered to bring the idol of Chellapillaraya to Delhi and keep the image in the fort. The Sultan revealed the wish of his "guru" to the army They moved south wards and entered Melkote The citizens of Melkote has decided to safeguard the ornaments of Chellapillaraya At that time the god has appeared to Anantālvar and told that he will return to Melkote after one year. He made a trick, by which the citizens could not see the army of sultan. The army returned to Delhi with the idol of Chellapillaraya The sultan has given the image to her

daughter "Lakshmi" She l ked that idol and worshiped with devotion The swamy too was attracted towards her He sought the help of his son Mānmata He has g en advice to appear before Lakshmi Beebi was astonished to see the Swami The God has expressed his wish to marry her in "Gandharva" style But she told that the marriage should be celebrated in a decent way before the group of gentlemen Swami thought of Indra, Siva and Brahma Parvathi and Siva acted as bride's party, while Sachi and Indra acted as bride grooms party. The marriage was celebrated at midnight. Swamy used to be in a "Manushyakara" at nights and Vigrahakara at day time.

Ramanujacharya came to know that the idol of Chellapillaraya was taken away by the army of Delhi Sultan. He wanted to get back the idol. All the subcastes of Hindu community has gathered and marched towards Delhi The Sultan has sought the advice of Makkaguru He played many tricks on Ramanuja but failed Then Sultan has asked Ramanuja the cause of his trip to Dilhi Ramanuja has requested to give him the idol of Ramapriya. At that time Swamy has decided to reappear before Ramanuja But Beebi warned him. She expressed

her wish to accompany her husband. Ramanuja sung a song and called Chellapillaraya The image jumped down and come over to saint In commoration of the discovery the deity was named Sampath Kumara Beebi has expressed her views to her father. She has decided to follow 'swami" to Melkote Ramanuja has settled the affair The Sultan too agreed and followed Ramanuja to Melkote. Before installing the idol Ramanuja had a private talk with Indiras.

In folk literature of Telugu the story of Beebi Nanchari is predominent Prof T. Donappa former vice chancellor of Telugu University, Hyderabad has pointed a story of this kind in the book "Janapada Kala Sampada". Here the heroine is Beebi but the hero is Sri Venkateswara Sri Balaji has fall in love with Muslim lady and got her marr.ed Because of his fear towards "Sri Mahalakshmi" He knocked Beebi in a cav. of Seven Hills, Tirumala

Dr. K Damodara Naidu lecturer in the department of Telugu Studies, S. V University, Tirupati has also collected this type of story near Yadamari of Chittoor District Andhra Pradesh

The title of the song is not Beebi Nanchiyar but "Perooramma". Venkateswara while sleeping saw a beautiful Muslim lady in his dream The very next morning he reveals to her mother to marry the muslim lady The mother warns 'Him' But he did'nt obey her words, and moved towards Perur There the Muslims caught him and put behind iron bars. Govindaraja the elder brother of Sri Venkateswara, Ranganayakulu of Pallikonda handled this situation in a gentle way and released 'Venkateswara' To clear the family disputes finally a settlement was made. Sri Venkateswara put his new 'Beebi' far away from Tirumala main temple.

There are two classical works on the story of Beebi Nanchiyar One is "Suratani Parinaya Prabhanda" This was written by Varanasi Achyuta Ramakavi This was published in 1854 He lived in Srikakulam District of Andhra Pradesh This book was dedicated to Sri Kurmanatha

Another one is "Acharya Sookti Muktavali" of Namburi Kesavacharya This was published by Jamili Nammalvar in 1972 In this book the story of Beebi Nanchiyar lies in 10, 11 and 12th parts Here the Nanchiyar was described as the daughter of Owarangajeb.

Among eight stories mentioned above there are several similarties The hereine is a Muslim, while Hero is different - Chellapillaraya, Ranganatha, and Venkateswara Srirangam, Tirupati and Melkote are the prominent centres of Vaishnavisam. Though these events were held in Melkote the well wishers such as purohits, citizens of that time has accepted this integrety and attributed this type of story to other archavataras

Secondly the efforts of Ramanujacharya is significant in Chellapillarayā's story. In other stories the God himself tried to marry Muslim lady

Thirdly the cause of 'hair offering' to God lies in Venkateswara's episode only While marrying Feebi Venkateswara has given an assurance that the devotees coming to him are Hindus and the goers are Muslims Any how all the stories express the unity among Hindus and Muslims

Now we shall discuss the historical evidence of the Beebi Nanchiyar's story

Prof B R Gopal in his work 'Sri Ramanuja in Karnataka' says

The traditional accounts speak of the Acharya's visit to Delhi in search of the processonal image

Selvapillai has comming into contact with the sultân there and his bringing back the image afer several interesting episodes This was a period of great confusion in the north and Delhi was in the grip of Muslim invasions There was no stable government at all there and it is difficult to persume that the traditional accounts have any historical basis. Further in view of the mode and means of communication of those days it would have taken more than an ye r for Acharya to visit to Delhi, spend some time there and written to Melkote with the image of Selvapillai Hence the legendery account is clearly a mixture of fact and fiction.

Ramanuja's entry to Melkote is in 1099 A.D exactly 82 years of age The 23rd inscription of Melkote indicates that already by 1255 A D the shrine was in existence There is a legend that while coming from Delhi Beebi Nanchiyar disappeared in a gracious light After returning to Melkote, Ramanujacharya has installed in idol of 'Beebi' near the foot of 'Sampatakumara' which can be seen today also There is another framed photo on the walls of the temple Now a days a "talattu" is sung in Melkote on tirunakshatram of Ramanujacharya. In

that lullaby there is a sentance ! AMMALURA-YANO AVALUDAYA PENNO ! This reveals the name of the k ng and nanchiyar.

Sri S Nagaraja Iyengar the press reporter of samyukta Karnataka of Melkote says that there is a tradition to call the far away place as "Delhi" So there is no question of Delhi of north. Furthermore at the time of Ramanuja there is confusion of the rulers of north

Sri Mudumbai Narasimhacharya who is well known as Vagamruta Varshi, Pravachana Bhaskara in Karnataka, former principal of Oriental College, Melkote revealed in his conversation that when he was young the common people used to sing the story of Chellap llaraya in folk metres in Melkote. But this practice was given up He added that his father Mudumbai Srinivasacharya has written "Yadavagiri-Mahatmya" in the early 20th century That book was printed at Krishna press Mysore in 19-5.

Ramanujaachaya has installed the image of Tu-lakanachiyar at the foot of Sampath Kumara swami There are several meanings hidden in this episode. Firstly the devotees worship the "Lord" directly If any one worship the God then the nachiyar will recommend the wishes and prayers of devotees to

the Lord Secondly though "Lakshmi" was brought by Muslim King, she was the devotee of Lord Vishnu Proper place must be given to Bhaktas So installing an idol near ' Moola Vigrahā" reveals the nature of "Bhakti Samrajya".

The idol of "Beebi" is the symbol of 'Jeevatma' when there is devotion of God Jeevatma lies near "Paramatma". The instalation reveals the concept of Visistadwaita also In the same way the God too wants closer to the devotees Venkateswara's affection towards Nanchiyar is the best example for the same.

Let us visit holy shrines



# అన్నమయ్య—త్యాగయ్య

శ్రీమత్ త్వదీయ చరితామృత మన్నయార్య
పీత్వాపిసైవ సుహితా మనుజా భవేయుః
త్వం వేంకటాచలపతేరివ భక్తిసారమ్
శ్రీతాళ్లపాక గురుదేవ నమో నమస్తే

వాగ్గేయకార మతిపై భవ దీపకేషు
త్వత్కల్పితేషు రసదిగ్ధ పదేషు నిత్యమ్
కుర్యత్సు బోధ మిహ నః కుత ఏవ మోహాః
శ్రీతాళ్లపాక గురుదేవ నమో నమస్తే

రామ పదభక్తి త్యాగయార్య వరునికిని
సమము గానేర రెవ్వరీ క్ష్మాతలమున
ప్రేమ నాఘను డొకసారి పిలిచెనేని
రాము "డొహో" యనుచును మార్పలుకు నంట

ఆంధ్ర వాగ్గేయకారుల్లో ప్రథముడు అన్నమయ్య. ప్రసిద్ధుడు త్యాగయ్య. కొండల మధ్య పుట్టి కోనల్లో పెరిగి కొండల రాయనిపై నిండైన భక్తి నిలుపుకొన్నవాడు అన్నమయ్య. నదీతీరంలో పుట్టి నాదోపాసన చేసి చివరకు నారాయణునిలో అంతర్లీనమయినవాడు త్యాగయ్య. ఈ వాగ్గేయకారుల జీవితసంఘటనల్లోనైతేనేం రచనల్లో నైతేనేం ఎన్నో సామ్యాలు కొన్ని వైషమ్యాలు కనిపిస్తాయి.

ఒక వ్యక్తి ఔన్నత్యానికి ఆవ్యక్తి అభిజాత్యం పరిశీలించడం ఒక పద్ధతి. అన్నమయ్య తల్లిదండ్రులు లక్కమాంబా నారాయణ సూరులు. వీరు నందవరీకులు, ఈ వంశమువారు ఋగ్వేదులు.

అశ్వలాయనసూత్రులు. భరద్వాజగోత్రులు. పొత్తపినాడు లోని తాళ్లపాక వాస్తవ్యులు. ఈలాంటి దంపతులకు స్వామి నందకాంశంతో అన్నమయ్య సర్వధారినామ సంవత్సరం వైశాఖమాసం పూర్ణిమ విశాఖా నక్షత్రంలో (9-5-1408) జన్మించినాడు.

త్యాగయ్య తల్లిదండ్రులు సీతమ్మ రామబ్రహ్మంగార్లు. వీరు ఆంధ్ర బ్రాహ్మణులు. భారద్వాజసగోత్రులు. కాకర్ల వంశీయులు. తమిళనాడులోని తంజాపురమండలం వాస్తవ్యులు. ఈ దంపతులకు సర్వజిత్‌నామ సంవత్సరం మేషమాసం శుద్ధషష్టి సోమవారం (4-5-1767) త్యాగయ్య జన్మించాడు.

అన్నమయ్యది పండితవంశమో కాదో తెలియదు కాని తండ్రి పేరు చివర "సూరి" అనే మాట వుంది. సూరి అంటే పండితుడని అర్థం. అన్నమయ్య అయ్యదగ్గర ఏం నేర్చుకొన్నాడో అంతుపట్టదు. కాని త్యాగయ్య మాత్రం పండిత వంశంలోనే పుట్టాడు. తాత గిరిరాజ బ్రహ్మం వేదవేదాంగ పండితుడు. తండ్రి రెండవ తులజాజి మెప్పు పొందినవాడు. త్యాగయ్య అయ్య దగ్గర మాత్రం కాదు అమ్మ దగ్గర కూడా చదువుకొన్నాడు

అన్నమయ్య బాల్యం గురించి ఎక్కువ వివరాలు తెలియవు. ఒకసారి ఇంట్లోని వారు కలిసి కట్టుగా గడ్డితెమ్మని కసిరితే అడివికి వెళ్ళి తిరుపతి కేళ్ళే వరుషగుంపులో కలిసిపోయి స్వామిని సందర్శించి ఘనవిష్ణువు చలవవల్ల వైష్ణవుడయ్యాడు. ఆపై ఆదివన్ శఠగోపయతుల దగ్గర వేదవేదాంగాలు నేర్చాడు. అన్నమయ్య సంగీత గురువు ఎవరో తెలియదు. కానీ త్యాగయ్య బాల్యంనుండీ

భక్తుడయినట్టు ఆధారాలున్నాయి. తల్లిదండ్రుల శిక్షణ, వీణా కాళహస్త్తయ్య. శొంఠి వెంకటరమణయ్యల ప్రాపకం త్యాగయ్యను మహోన్నత వ్యక్తిగా తీర్చింది. ఒక్కమాటలో చెప్పాలంటే అన్నమయ్య స్వయం శిక్షణతో సుశిక్షితుడయ్యాడని చెప్పవచ్చు.

ఇక కుటుంబజీవితం పరిశీలిస్తే అన్నమయ్యకు ఇద్దరు భార్యలు. కొండమీద వైష్ణవుడై కూర్చొన్న అన్నమయ్యను ఇంటికి చేర్చి ఇల్లాండ్ర నిద్దరిని కట్టబెట్టారు తల్లిదండ్రులు. వారే తిమ్మక్క అక్కలమ్మలు త్యాగయ్యకుకూడా ఇద్దరు భార్యలు. ప్రథమ కళత్రం పార్వతి పరలోకం చేరుకుంటే కమలాంబను పెళ్ళి చేసుకోవలసి వచ్చింది త్యాగయ్యకు.

అన్నమయ్య పుత్రులే వారసులయ్యారు. తండ్రి పేరు నిలిబెట్టినవాడు పెదతిరుమలాచార్యుడు. తాతపేరు శాశ్వతం చేసినవాడు చిన్నన్న. అయితే త్యాగయ్యకు పుత్రులులేని కొఱతను శిష్యులే తీర్చారు. గురువుగారిని గుండెల్లో నిలిపినవారు వాలాజాపేట వెంకటరమణ భాగవతర్. ఉమయాల్పురం కృష్ణ భాగవతర్, తిరువొత్తియూర్ వీణా కుప్పయ్యర్ ప్రభృతులు.

అన్నమయ్య జీవించింది 95 ఏళ్ళు. త్యాగయ్య ఈభూలోకంలో గడిపింది 80 ఏళ్ళు. అన్నమయ్య భక్తితో ముక్తి పొందాడు. త్యాగయ్య సన్యాసం స్వీకరించి చతురాశ్రమ ధర్మాన్ని పూర్తిచేశాడు. అన్నమయ్య చివరిదశ ఎక్కడగడిపాడో పరిశోధకులు తేల్చవలసిన అంశం. కాని త్యాగయ్య బృందావనం తిరువైయూర్‌లో మనం ఈరోజు కూడా సందర్శించ వచ్చు.

ఇక జీవిత సంఘటనల్లోని సామ్యాలు చూద్దాం. అన్నమయ్య త్యాగయ్యలిద్దరు భార్యలిద్దరివల్ల బాధలుపడినట్లు కనిపించదు. సాధారణంగా భక్తుల కెవరికిన్ని పట్టని అదృష్టమిది. అయితే వీరిద్దరికి బంధువుల బాధలు మాత్రం తప్పలేదు. దండె భుజాన తగిలించుకొని వేళాపాళాలేకుండా పిచ్చిపాటలు పాడుతుంటే అన్నావదినెలు అన్నమయ్యను అనవసరంగా కసిరారు. అలాగే ఎపుడూ పూజాపునస్కారాలేనా అని అన్న త్యాగయ్యను నిందించడం ఇద్దరిలోనూ కనిపించే సంఘటనా సామ్యం.

అయ్యో పోయెం బ్రాయము కాలము
 ముయ్యంచు మనసున నే మోహమతినైతి
అంతహితులా తనకు నన్నలుమ దమ్ములును
 వంతువాసికి బెనగు వారేగాక 5-121

అన్నలంటా తమ్ములంటా ఆండ్లంటా బిడ్డలంటా
 పన్నుకొని తిరిగేరు బహురూపాలు 11-2-55

అప్పులవారే అందరును 11-3-15

అనేవి అన్నమయ్య ఆవేదనాకారాన్ని తూకం పడతాయి.

తల్లిదండ్రి భక్తి నొసగి రక్షించిరి
 తక్కినవారలెంతో హింసించిరి 2-30

కాయ జనక నా ప్రాయములెల్లను
 మాయాపూరితులైన దాయాదులచేత
పాయపర్యంతము కాయక్లేశము చెంద
 నాయెను గాని 1-308

నాయెడ వంచన సేయకురా....
   దాయాదుల పోరైనగాని  1-465
అందరి చేతను నా బ్రతుకు లిపుడు
   నిందల కెడమాయ  2-233
ఉపకారి నేనైతె అపకారులయ్యేరు
   కృపజూచితే మిగుల నెపము లెంచేరయ్య
చపల చిత్తులు భక్తవేషులై నను జూచి
   శతృలయ్యేరు

అనే వాక్యాల్లో త్యాగయ్య అలసట తెలుస్తుంది.

ఈ కవిగాయకులిద్దరు రాజాజ్ఞను పెడచెవి పెట్టడం మరొక్క సామ్యం. అన్నమయ్య కుటుంబీకులకు మునుపు రాజాశ్రయం లేదు. కాని త్యాగయ్య పూర్వీకులకు రాజాశ్రయం వుంది. అన్నమయ్యవల్ల తనకు అభ్యుదయం కలుగుతుందనుకొన్నాడు సాళ్వ నరసింహ రాయలు. స్వామి పదాలువిని సంతసించడంతో పూరుకోక సగర్వంగా తనపై పదం పాడమన్నాడు. కాదన్న అన్నమయ్యను కారాగారంలో పెట్టించాడు. సంకెళ్లు తొడిగించాడు. అయినా ఆపద మొక్కులవాని దయతో అన్నమయ్య బంధవిముక్తుడయ్యాడు.

దొడ్డవాడ నయ్యేందుకు దొరల కొలువవలెనా  6-13

అన్నది అన్నమయ్య ప్రశ్న.

తన సన్నిధిలో ఒకపాట పాడితేచాలు 10 (వేలి) ఎకరాల భూమి ఇస్తానని రెండవ శరభోజిమహారాజు అర్థించినా ఆశ పెట్టినా "నిధి సుఖమా రామునిసన్నిధి సుఖమా" అంటూ నిర్భయంగా త్రోసి పుచ్చడం త్యాగయ్యకే తగింది.

ధనదారసుతాగార సంపదలు
ధరణీశుల చెలి మెుకపదవా ఓ-౨౨

అనడం రాజసేవ పట్ల త్యాగరాజుకున్న విహ్యాన్ని వట్టిస్తుది.

మహిమలు ప్రదర్శిస్తేగాని మహనీయులని మానవోత్తములని అంగీకరించడం మానవ మాత్రుల నైజం. ఈ వాగ్గేయకారులిద్దరు మహిత తపస్సంపన్నులు. వీరు ప్రదర్శనకోసం మహిమలు చూపలేరు. అన్నమయ్య వరాల వల్లనే సామాన్యదండనాదుడు సాళ్వ నరసింహరాయలు సార్వభౌము డయ్యాడు. స్వామికి పుల్లమామిడి నైవేద్యం పెట్టాననే ఆవేదనవల్ల తియ్యమామిడయింది. ఈమహిమలు జనుల్లో ప్రాకడంతో ఇహానికి పాటుపడే అలగా జనం ఎక్కువ కావడంతో "తగిలేరు పొగిలేరు దైన్యమే చూపేరు, కొసరేరు ముసరేరు కోరిక తీర్చమనేరు తడపేరు తిగిరేరు కడగి వేడుకొన్నాగానిమ్మరు లోకుల"ని అన్నమయ్య దైవముతో మొరపెట్టుకోవలసినస్థితి వచ్చింది.

త్యాగయ్యకూడా అన్నమయ్యలాగే మహిమలు ప్రదర్శించాలని సిద్ధపడలేదు. ఒకవ్యక్తి మరొక వ్యక్తిపై చూపే సానుభూతి కోటి వరాలకంటె ఎక్కువ ఫలితాన్ని ఇస్తుంది. మంచంపట్టి ఆశవదలు కొన్న అన్నమయ్యను ఆరోగ్యవంతుణ్ణి చేయడం, బావిలోపడ్డ భక్తుణ్ణి బ్రతికించి భార్య పసుపుకుంకుమలు నిలపడం త్యాగయ్య మహిమ లుగా చెప్పుకొనే కథలు.

సగుణోపాసకులయిన భక్తుల యావదాస్తి పూజావిగ్రహాలే. ఆ విగ్రహాలు మాయమయితే వడే ఆవేదన అన్నమయ్య త్యాగయ్యలో కనిపించే మరొక సన్నివేశసామ్యం విజయనగర [illegible]

కపిలేశ్వర పురుషోత్తమ గజపతులు దండెత్తి వచ్చినపుడో యింకెపుడో అన్నమయ్య విజయనగరంలో వుండగానో లేదా స్వగ్రామములో వుండగానో స్వామి విగ్రహాల్ని శత్రువులు పట్టుకెళ్ళారని ఐతిహ్యం. స్థలం మార్పిడిలో కనబడలేదనడం అతికిన సత్యం. అపుడు అన్నమయ్య

బౌళి

ఇందిరా రమణుదెచ్చియియ్యరో మాకిటువలె
పొంది యీతనిబూజించ బొద్దాయ నిపుడు
ధారుణి మైరావణు దండించి రాముదెచ్చి

నేరుపు మించిన యంజనీతనయా
ఘోర నాగపాశముల గొట్టివేసి యీతని
కారుణ్యమందినట్టి ఖగరాజ గరుడా

నానాదేవతలకు నరసింహుగంభములో
పొనివట్టి చూపినట్టి ప్రహ్లాదుడా
మానవుడే కృష్ణుమహిమల విశ్వరూపు
పూని బండి నుంచుకొన్న పోటు బంట యర్జునా

శ్రీ వల్లభునకు నశేష కైంకర్యములా
శ్రీ వెంకటాద్రిపైన శేషమూరితి
కైవసమైనయట్టి కార్తవీర్యార్జునుడా యీ
దేవుని నీవేళ నిట్టెమాకు దెచ్చి యీయరే

అధ్యాత్మ సంకీర్తనలు రేకు 373

అని ఆక్రోశించాడు.

అలాగే త్యాగయ్య పగలనక రాత్రనక పాటలు పాడుతూ ఇంటి విషయం పట్టించుకోకుండా వుంటే విసిగి వేసారి అన్న జపేశయ్య త్యాగయ్య పూజా విగ్రహాలు కావేరిలో పారవేయించాడని ఐతిహ్యం. అపుడు "నేనెందు వెదుకుదురా హరి" (2-21) అని ఆక్రోశించడం అంతరాత్మను కదిలించే సన్నివేశం.

అన్నమయ్య 12 శతకాలు, ద్విపద రామాయణం, 32 వేల సంకీర్తనలు ఇంకా సంస్కృతంలో వేంకటాచల మాహాత్మ్యం, సంకీర్తనలక్షణాలు వ్రాశాడు. కాని వీటిలో శ్రీవేంకటేశ్వరశతకం, సుమారు 14 వేల సంకీర్తనలు మాత్రం లభ్యం. రోజుకు ఒక్క కీర్తనవంతున జీవితాంతం రచనలు చేపట్టిన భక్తుడు అన్నమయ్య.

త్యాగయ్య వాల్మీకి రామాయణ శ్లోక సంఖ్య దృష్ట్యా 24 వేల కీర్తనలు వ్రాశాడని అంటారు. వాటి లో ప్రహ్లాదవిజయం, నౌకాచరితం సీతారామవిజయమనే సంగీత రూపకాలు చేరతాయో లేదో, అయినా ప్రస్తుతం సుమారు 700 కీర్తనలు, రెండు సంగీత రూపకాలు మాత్రం లభిస్తున్నాయి. నాదబ్రహ్మలో లీనమయ్యేదాకా సంకీర్తనలు పండించిన భక్తుడు త్యాగయ్య.

అన్నమయ్య నమ్ముకొన్న దేవుడు వేంకటేశ్వరుడు. ఆవాగ్గేయకారుడు తాను దర్శించిన వివిధమూర్తుల్లోనూ వేంకటేశ్వరుణ్ణి దర్శించాడు. కాకపోతే అతడు దర్శించిన వన్నీ వైష్ణవ క్షేత్రాలు. అతని రచనల్లో విశిష్టాద్వైతం కొన్నిచోట్ల వీరవైష్ణవ భావం దాల్చివుంది. ఆనాటికి దేశంలో ప్రబలంగావున్న వీరశైవాన్ని అణచడానికి ఈ వీర వైష్ణవం తప్పనిసరి అయింది. అందువల్లనే శివనింద మోతాదు హెచ్చినట్లుగా కనిపిస్తుంది. కాని త్యాగయ్య అద్వైతి. అతనిది

ప్రధానంగా రామభక్తి. అయినా స్వపరభేదం లేకుండా కోవూరు సుందరేశ్వరస్వామి,తిరువొత్తియూర్ వడివుడైయమ్మన్, నాగలాపురం నీలాయతాక్షి, పంచనదీశ్వరస్వామి ధర్మసంవర్ధనిదేవిని నోరారాకీర్తించాడు. కంచి వరదుణ్ణి తిరుమల వేంకటేశ్వరుణ్ణి, ఘటికాచల వాసుణ్ణి కరాలు జోడించి నమస్కరించాడు. అన్నమయ్య రచనల్లో కంచి వరదరాజస్వామి, రంగనాథ కీర్తనలు కనిపించినట్లే త్యాగయ్య రచనల్లో తిరువెంకటాచలపతి సాక్షాత్కరిస్తాడు.

తెర తీయగ రాదా లో ని
తిరుపతి వేంకటరమణ మచ్చరమును 1-420

వేంకటేశ నిను సేవింపను పది
వేల కనులు కావలెనయ్యా 2-179

లనేవి తిరుపతిలో పాడిన కీర్తనలు.

అంతేకాదు అతని రామభక్తి సామ్రాజ్యం విస్తారమయింది కూడా. కుమారస్వామిని "రఘువర భాగినేయ' అని పార్వతిని "మా వరునికి చెల్లెలివని" కామాక్షిని "రామసోదరి" (2-176) అని ధర్మసంవర్ధనిని "రామసోదరిపై వెలసిన (2-28) అని పేర్కొనడంలో ఈ విషయం స్పష్టమవుతుంది. అంచేతనే "శివ మాధవ భేదము చేయరాదు" (2-54) అని హెచ్చరించాడు త్యాగయ్య. కొందరు అతి పరిచయంతో శ్రీవేంకటేశ్వరస్వామిని "జాతర దైవాల సరిగా" చూడడాన్ని అన్నమయ్య నిరసిస్తే అచ్చం ఈలాగే త్యాగయ్యకూడా రాముడొక్కడే దేవుడని నీ మనసు నీ సొగసు నీ దినుసు వేరే-తామసమత దైవమేల (2-155) అని నిందించడం గుర్తుంచుకోదగ్గ సామ్యం.

అన్నమయ్య త్యాగయ్యల రచనల్లో నవవిధభక్తులు కనిపిస్తాయి. అన్నమయ్య ఉన్మాద, పతివ్రతా, విజ్ఞాన, ఆనంద, రాక్షస, తురీయ, తామస, వైరాగ్య, రాజస, నిర్మల భక్తిభేదాలను (7-235) పేర్కొన్నాడు. అంతేకాదు అన్నమయ్య దృష్టిలో "కైవల్యమునకంటె కైంకర్యమెక్కుడు" (7-249) కాని సూక్ష్మంగా తులనాత్మకంగా పరిశీలించినపుడు అన్నమయ్యలో రాజసప్రవృత్తి ఎక్కువేమోనని పిస్తుంది. ఈ రాజసం [illegible] గౌరవిస్తుంది. అది సమయంలో అవసరమయితే గర్జిస్తుంది. అయినా స్నేహంలో ఏదైని లెక్కపెట్ట వవసరం లేదు అందువల్లనే అన్నమయ్య

నీకు నీవే వలసితే నీవే నన్ను గాచుకొమ్ము — 10-78

నేరుపున నాకైతే నే దిక్కు కలదుగాని
చేరి నీ కావల దిక్కు చెప్పి చూపగలదా — 10-57

నిన్ను నీవే తెలుసుకో — 10-114

అని అనగలిగాడు.

కాని అన్నమయ్య తానన్నదానికి పశ్చాత్తాపపడిన సందర్భాలున్నా లేకపోలేదు.

చిత్తాన బెట్టకు మీ మాట శ్రీ రమణ మరువకు
హత్తి నిన్ని మెరుగుదు నజ్ఞాని నేను — 7-103

అల్పశక్తివాడ నేను అధికశక్తివి నీవు
పొల్పనెంత పనికి బూనితి నయ్యా — 7-156

ఎట్ట వలసినజేయు మిన్నియు నీ చిత్తమే
నెట్టన నొకడనా నీవే యింతను — 7-222

నావల్ల నీకేమున్నది నారాయణ నీవు నన్ను
కావించి రక్షించే వుపకార మింతేకాక 7-253

ఈ మాట గర్వముగాదు నీ మహిమే కొనియాడితిగాని
చేముంచి నా స్వాతంత్ర్యము చెప్పినవాడగాను
నేమాన బాడేవాడను నేరము లెంచకుము 7-104

త్యాగయ్యది సాత్త్వికభక్తి. ఈ అంశాన్నే వాచ్యంగా

"భక్తి బిచ్చమీయవే-భావుకమగు సాత్త్విక
భక్తి బిచ్చమీయవే" (2-46)

అని స్పష్టంచేశాడు. అందుకే రాజసగుణము మానితి-3 అంటూ రాజస జనులతో జతకూడకుండా వుండడాన్ని తన అర్హతగా చెప్పుకొన్నాడు. అన్నిటికి మించి అన్నమయ్య

"నేనొక్కడ లేకుండితే నీకృపకు బాత్రమేది
పూని నావల్లనే కీర్తి బొందేవు నీవు (8-48) అని అంటే

త్యాగయ్య పొగడకుంటే నీకేమి కొదవో (2-22) అనడంలో సాత్త్వికత పుట్టిపడుతుంది.

"నీవులేక త్యాగరాజు నీ గుణముల నెటు బాడును" (కీ 1-462)

అని త్యాగయ్య బాధపడడం హృదయస్పర్శిగా వుంది.

కీర్తనల్లో వైయక్తిక విషయాలు ప్రస్తావించేటప్పుడకూడా ఈ భేదం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. తన రచనల్ని అనుకరించే వారినుద్దేశించి అన్నమయ్య

"వెఱ్ఱులాల మీకు వేడుక కలిగితేను
అఱ్ఱువంచి తడుకల్లంగరాదా"

ముడిచి వేసిన పువ్వు ముడువ యోగ్యముగాదు
కుడిచి వేసిన పుల్లె కుడువగా గాదు
బడినొకరు చెప్పిన బ్రతి చెప్పబోతేను
అడరి శ్రీహరి కది అరుహము గాదు
వుమిసిన తమ్మలో నొక కొంత కబ్రమము
సమకూర్చి చవిగొని చప్పరించనేల
అమరగ చాయాపహారము సేసుక
తమమాట గూర్చితే దైవము నగడా 7-260

అని ఉక్రోషంతో నిందిస్తాడు.

"నరసింహా రామకృష్ణ నమో శ్రీవేంకటేశ" సంకీర్తనల్లో తన శత్రువుల్ని చావగొట్టి సంహరించమంటాడు. కాని త్యాగయ్య మాత్రం తనపట్ల అపచారం చేసిన వారిని, అకృత్యానికి సిద్ధపడినవారిని గూడా ఏమీ అనకుండా

"ఎన్నో తప్పులు చేసిన వారిని రాజన్య నీవు బ్రోచినావు"
అంటూ వారిని క్షమించమనడం సాత్త్వికతకు ఎత్తిన కరదీపం.

అన్నమయ్య త్యాగయ్యలు అభినివేశంతో వర్ణించిన అవతారాలు మూడు. నారసింహ- శ్రీరామ- కృష్ణావతారాలు. అన్నమయ్యలో నారసింహకీర్తనలు సుమారు రెండు వందలు కనిపిస్తే త్యాగయ్యలో రెండే రెండు కీర్తనలున్నాయి.

"నరసింహ్వా నను బ్రోవవె శ్రీలక్ష్మి" 1-449
"శ్రీనారసింహ్వా మాం పాహి" 2-173

అనే సంకీర్తనలు స్వాములవారు ఘటికాచలవాసు నుద్దేశించి పాడినవి. అన్నమయ్య నారసింహకీర్తనల్లో అహోబల నరసింహ కీర్తనలెక్కువ.

ఆదివన్ శఠగోపయతుల దగ్గర శిష్యరికం వల్లను, అహోబలవాసం వల్ల అన్నమయ్య నరసింహుణ్ణి బహుధా కొనియాడి వుండవచ్చు. అంతకంటెకూడా నరసింహమంత్రోపాసన కారణంగా 32వేల కీర్తనలు అన్వర్థంగా వ్రాశాడని శ్రీ గౌరిపెద్దివారి అభిప్రాయం. త్యాగయ్య ప్రహ్లాద భక్తి విజయంలో కూడా నరసింహునికి ప్రాధాన్య మివ్వలేదు. ప్రహ్లాదునికి నారాయణ రూపంలో సాక్షాత్కరించినవాడు రాముడు కావడం త్యాగయ్య ప్రత్యేకత.

ఇక రెండవదయిన శ్రీరామావతార కీర్తనల్లో పోలికలిద్దరికి వున్నాయి. అన్నమయ్యకు రామావతారంపై ప్రత్యేక అభినివేశం వుంది. అదీగాక అతడు ద్విపద రామాయణకర్త కూడా. అన్నమయ్య సంకీర్తనల్లో దాదాపు రెండువందల రామాయణ కీర్తనలున్నాయి. శ్రీ రామకృష్ణానంద స్వాములవారి ఆదేశంతో రామషడక్షరీమంత్రాన్ని తొంభైయారుకోట్లు జపించి త్యాగయ్య ధన్యుడయ్యాడు. రాముణ్ణి వర బ్రహ్మ స్వరూపంగా భావించడం ఇద్దరిలోను సమానం. అన్నమయ్య

"ఇతడే పరబ్రహ్మ మిదియె రామకథ — 11-1-224
భవుడెంచు దారక బ్రహ్మ మీతడు" — 11-1-219

అని పేర్కొన్నాడు. త్యాగయ్య "పాహి కళ్యాణనామ" కీర్తనలో వర మైన బ్రహ్మము పాషేభసింహము (1-132) అని "ఏలనీదయ" కీర్త నలో "యోగీంద్ర సుహృద్భావిత ఆద్యంతరహిత" (11-344) అని "దుడుకుగల" కీర్తనలో ఆవాఙ్మానసగోచర (1-229) అని జగదానందలో అవికృత త్యాగరాజసన్నుత (1-225) అని శ్రీ రామరామ సంకీర్తనలో "అఖండరూప" (1-181) అని "సుందరతరదేహం"లో శివం అద్వైతం అమలం (2-224) అని "స్వర్గలోక" కీర్తనలో "కేశనుతాంత నామరూప రహిత" (1-185) అనడం గుర్తించవచ్చు.

